శ్రీరస్తు.

---

శ్రీమత్పరశురామపంతులలింగమూర్తి

గురుమూర్తియను.

మహాకవీంద్ర ప్రణీతంబైన.

126

---

# సీతారామాంజనేయసంవాదమను.

# నీయోగశాస్త్రము

---

బాలురకు.

నత్యంతోపయుక్తంబగునటుల లేఖకప్రమాదజనితదోష

రాహిత్యంబులు లేకుండునటుల

బరిష్కరింపఁబడి.

---

చింతాద్రిపేటలోనున్న

ప్రభాకరముద్రాక్షరశాలయందు.

ముద్రింపఁబడియె.

౧౮౬౮ సం॥ జూ౯ నెల ౧౮ తేది.

---

சீதாராமாஞ்ஜநேயசம்வாதம்.

విషయసూచిక.

శ్రీరస్తు.

---

## సీతారామాంజనేయసంవాదము.

---

### ప్రథమాశ్వాసము.

శ్రీమద్దివ్యనిజాంఘ్రిపద్మములు సంసేవింపుచుం భక్తిచే। ధీమంతుండగు నాం
జనేయునిన సద్దేహేంద్రియాతీతచి। ద్ధామానందుఁ డవీవ నేన నికృపం బోధిం
చు శ్రీజానకి। రామ బ్రహ్మను నంతరంగమున నారాధింతు నశ్రాంతముం ॥సీ॥ త
న రజోగుణము చేఁ దనరంగ నే దేవి గల్పించు నఖిలలోకముల నెల్లఁ। దన సత్వగు
ణముచే నొనరంగ నే కొమ్మ పోషించు నిసర్గభూతములను। దనత మోగుణముచే
దగ నే వధూమణి జగముల నెల్ల సంక్షయముం జేయుఁ। దా శుద్ధసత్వ ప్రధానయై
యే రామవామాంకమున నజస్రము వసించు। నట్టి భువనైకమాత దయానమేత। స
ద్గుణవ్రాత నిర్మలస్వాంతపూత। భక్తజనమానసోద్యానపారిజాత। సీత కరుణించి
మమ్ము రక్షించుగాత॥ సీ॥ తతశుద్ధసత్వప్రధానవిగ్రహులని ములరపస్సత్వత
మోగుణకులు। స్వసుధర్మశృంగార వైరాగ్యవేషులు శిశ్వోద్భవస్థితి విలయకరు
లు। కప్త కాంచననీరధరచంద్రవర్ణులు శుభకమండలు చక్రశూలధరులు। ఘనసత్య
వైకుంఠకైలాసవాసుల వరహంసఖగవృషవాహనులను। షడ్గుణైశ్వర్యయు
తులభాషావధూప్రాసన్న మంగళదేవతాసర్వమంగళాధిపతుల సాక్షాత్పర
మాత్మమయుల। బ్రహ్మవిష్ణుమహేశులఁ బ్రస్తుతింతు॥ శా॥ బ్రహ్మాండంబు సృజి
ప బెంపసమయింపం జాలు సామర్థ్యముల్। బ్రాహ్మా వేంద్ర నగేంద్ర చా
పులకు సంపాదింపుచు న్వారికిం। బ్రహ్మాత్మైక్యవివేకమిచ్చుచును వీవ నేన నెడు
పాఠమందు నెనినీవని యొకపాఠము గలదు సంభావింపుచుం బ్రోచు నా। బ్రా
హ్మీమంగళదేవతాగిరిజలం బ్రార్థింతు నశ్రాంతముం॥క॥ వరశిశ్వోద్గతిహే
తువు। పరముఁడు పురుషుండు ప్రకృతి బ్రహ్మను పరమే। శ్వరుఁ డంచుఁ దజ్ఞులెవ్వ
ని। బలికింపుదు రగ్గణాధిపతి నర్చింతుం॥మ॥ తనరం గాయము చేత రామచర
ణద్వంద్వైకదాస్యంబు హె। చ్చినభక్తిం దగు వాక్కుచే ననిశము శ్రీరామ
నామప్రకీర్తనముం జిత్తము చేత రామపరతత్వధ్యానముం జేయు శ్రీహ
నుమంతుం బ్ర ముపాశయింతు మదభీష్టార్థంబు సిద్ధింపఁగం॥క॥ ఆరయమ
దా...

పిన| నారాయణగురువులను మనంబున గొలుతుఁగా ||సీ|| ఘనపాపములు మాప దను తాపమును బాపఁదనరూపమును జూపఁడనరువానిఁ । దనకాయమును ద్రోయఁబెనుమాయ నెగి మాయముగఁ జేయ గుటిఁదాయఁదగినవాని। మును కారణశరీరమునుజీరన వికారవరకారణముఁజేరఁ బరగువానిఁ । దనయందు జగమందుఁ దాఁబొందుగా నెందు నెలువొందనిందుగాఁ దెలియువాని । నిగ మనిగదితసుగుణములగణితముగఁ। మిగులనిగుడఁగ సగుణుడైయగుణుఁడగుచు బగలు రేయన కొకతీరి నెగడువాని। శ్రీమహాదేవ గురునిభజింతు నెపుడు||శా|| లోకాలోకపరీత భూచరమహాలోకైకపకారంబుగా శ్రీకల్యాణకరోరుకా వ్యచయమ్ముల్ప్రస్థంబుగావించుసు। శ్లోకుల్పుణ్యమతుల్జగద్గురువులై శోభిల్లుచున్నట్టివా। ల్మీకివ్యాసమయూరబాణకవి కాళీదాసులంగొల్చెదన్ ||గీ|| మహితగురులఘు వర్ణధర్మములు నియమములుగలితకర్తృకర్మ క్రియలును దెలిసి। నామరూపావ్యయవిలక్షణంబులాత్మ। నెఱిగినకవీశ్వరుండె కవీశ్వరుండు ||

అట్లుగావున||ఉ|| నన్నయభట్టువాంధ్రకవినాథునిఁదిక్కనసోమయాజినిం బన్నగసోమసత్కవినిభాస్కరబమ్మెరపోతరాజులన్ మున్నుప్రసిద్ధిఁగాంచు కవిముఖ్యులనందఱ నెమ్మనంబులో నెన్నినమస్కరించెదన భీష్టఫలాప్తిదనచున్నట్లుగా ||క|| శుద్ధపదయుక్తిదోఁజేఁగియు। బద్ధమునునిబద్ధిగానిబద్ధినెగి మహాబద్ధముగాఁగనుకుకవుల। నాగ్ధ్యముమానుకొలుతు నభినందింతున్ ||మ|| గరిమన్స్వర్గమనేకభూషణములై కన్పట్టుచందంబునం । బగమాత్ముండఖిల ప్రపంచమయుఁడై భాసిల్లునట్లొటచే।సురసిద్ధోరగయక్షకిన్నరనరస్తోమాదిశశ్వచ్చరాచరరూపోజ్జ్వల సర్వభూతములకున్సద్భక్తితో మ్రొక్కెదన్ । వ అని యిష్టదేవతాప్రార్థనంబును సద్గురుకీర్తనంబును సంస్కృతాంధ్రసత్కవిస్తోత్రంబును గావించి యేను ముముక్షుజనహితంబును సంసారసాగరోత్తారకంబును దారకసాంఖ్యామనస్కాత్మకంబును జీవబ్రహ్మైక్యసాక్షాత్కారసాధారణకారణంబును నయిన రాజయోగంబంతయు నొక్కప్రబంధంబుగా రచియింపనిశ్చయించి పరమైకాంతంబున శ్రీగురుమంత్రదేవతాతత్త్వాత్మానుసంధానంబు సేయుచున్నసమయంబున||

ప్రబంధహేతువు.

||సీ|| కమనీయవరదివ్యకాంచనచేలంబు గాషాయవస్త్రంబుగా ధరించి। చాపబాణంబులుచంచత్కమండలుదండముల్ గాఁగహస్తములఁబూని। రమణీ

యరత్నహారంబురుద్రాక్షమాలికగాగళంబున లీలదాల్చి సీతావధూటినీ శ్రీరాజయోగాహ్వ యాధ్యాత్మవిద్యగానవధరించి। ప్రేమమీఱంగ శ్రీరా మరామరామ । యనుచుదనపేరునుడువుచునద్భుతముగశ్రీమహాదేవగురుం డమునరామవిభుండు । కరుణతోడుతనెదురసాక్షాత్కరించె । వ । ఇట్లు శిష్య వాత్సల్యంబున సాక్షాత్కరించి మదీయ దీర్ఘదండనమస్కా రంబులు చతుర్విధపురుషార్థప్రద చతురక్షర సమన్విత నారాయణ నామ స్మరణ పూర్వకంబుగా నంగీకరించి కలకల నవ్వుచు శరీర త్రయ విలక్షణావస్థాత్రయ సాక్షిపంచకోశ వ్యతిరిక్త సచ్చిదానంద స్వరూప ప్రత్య గాత్ముండవైన నీవసత్యజ్ఞానానంద స్వరూపపరమాత్ముండనైన నేను సత్య జ్ఞానానంద స్వరూపపరమాత్ముండనైన నేనసచ్చిదానందస్వరూప ప్రత్య గాత్ముండవైననీవనిసర్వోపనిషత్సారభూతార్థంబైన పరమతత్వరహస్యా ర్థంబుపదేశించి యీయభేదవిజ్ఞానదృష్టిచేత నిరంతరంబునన్నవలోకించు చుజీవన్ముక్తిసుఖంబనుభవింపుము। ప్రారబ్ధభోగావసాన సమయంబున ఘటా కాశంబును మహాకాశంబునంగలసినవిధంబున నాయందువిదేహకైవల్యం బునొందెదవు సందేహంబులేదని యాజ్ఞాపించియిప్పుడీవు బ్రహ్మాండపురాణం బునందధ్యాత్మరామాయణంబు మామహేశ్వర సంవాదరూపంబై యొప్పు నందు శ్రీరామహృదయంబను నితిహాసంబు సీతారామాంజనేయ సంవాదం బనం బ్రసిద్ధిల్లునదిసంక్షేప రూపంబుగావున నయ్యర్థంబువిస్తరించి యొ క్కప్రబంధంబుగారచియించి నాపేర నంకితంబుసేయుము సర్వపాపవిని ర్ముక్తుండ నైకృతార్థుండవయ్యెదవని యానతిచ్చితిరోహితుండయ్యెనటమే ల్కొనిపరమానంద భరితాంతఃకరణుండనై॥ శా॥ శ్రీవిశ్వేశ్వర పార్వతీప్రి యతమున్ శ్రీజానకీరామవా। క్యావిర్భూతముమారుతాత్మజనుబోధ్యంబైత గన్ శ్రీమహాదేవాచార్య వరాంకితంబుగను ధాత్రిన్ రాజయోగంబు సం। భావింపన్ రచియింపఁగల్గెనిక నాభాగ్యంబుసామాన్యమే॥ క॥ వ్యము భవ్యంబ గుమతార్క్యవ్యముసంతతము మోక్షకాములచే శ్రో। తవ్యమువక్తవ్యము మం। తవ్యముభావ్యమును గీర్తితవ్యముగాదే । వ। అనివిచారించి సంతోషభరిత చిత్తుండనైమదీయాచార్యపరంపరావతారంబు నభివర్ణించెద॥ 3

—*గురుపరంపరాభివర్ణనము,*—

శా। సత్తామాత్రుఁడు నిర్విశేషుఁడు। తనూసర్వేంద్రియప్రాణహృ చ్చిత్తాహంకృతిధీప్రకాశకుఁడు సచ్చిత్తోషకాయుండువి। ద్వత్తాపాంధ

తమః ప్రదీపమయుఁడాత్రస్వామి భాసిల్లెశ్రీ। దత్తాత్రేయగురుండనంగజ
గడంత ర్యామియై మున్నిల౯ ॥ క ॥ ఆదత్తాత్రేయగురు । శ్రీదివ్య పదార
విందు * సేవాదిశ్రీ మోదుఁడు ప్రత్యక్షు ప్రహ్లాదుండన శ్రీజనార్దనా
హ్వయుఁడొప్పె౯॥మ॥తనశౌశీల్యము శాస్త్రించుతనమునాత్మ జ్ఞానముంజూ
చి హేళిచ్చినకూర్మి౯ న్నిజదివ్యరూపములతో శ్రీభారతీమోక్షకా । మినులే
తెంచియహర్నిశంబు దనునెమ్మిం గొల్వఁగా శ్రీజనార్దనయోగీశ్వరుఁడొ
ప్పెనెల్లడన విద్యాధ్వాంతమార్తాండుఁడై॥ తే॥గీ॥ఆజనార్దన గురున
కత్యద్భుతముగ। శ్రీమదేకో గురుస్వామిశిష్యుఁడయ్యె।మునువశిష్ఠ మహాము
నీంద్రునకునర్హి।దాశరథిభక్తుఁడయిన చందంబునను॥సీ॥ తనదువైరాగ్యం
బుఁగనుఁగొనిసిగ్గుచేసిన కాది మునులజు వెనుకనొదుఁగ। దనదుసద్భక్తిచేత
నుగట్టువడియింట శ్రీకృష్ణుఁడాత్మియ సేవఁజేయఁ।దనమువిజ్ఞానతీర్థ మునందు
గ్రుంకుచు గంగాదినదు లెల్లగంతులిడఁగ।దనదుపూర్ణాత్మసంతత సమాధిని
జూచి ప్రహ్లాదుఁడాశ్చర్యపరత నొంద। స్వకృతగీతాదిశాస్త్రభాష్యంబు లెల్ల
వేదతుల్యంబులై ధాత్రి వెలయుచుండ। వామదేవేశు లారున వ్యాసభీష్మ।స
దృశుడే కొంజనార్దనస్వామి వెలసె॥క॥ధరలో నారాయణునకు। నరుగతినే
కొంజనార్దనస్వామికి శ్రీ।నరహరిమహేశగురుఁడ। చ్చెరువుగసద్భక్తి మెఱ
యశిష్యుండయ్యె౯॥చ॥అతఁడుసమస్తభూతబహిరంతర నావృతబోధమూ
ర్తియై।వితతసమాధినుండు నెడ వేల్పులు।సూచియుతండుదొల్లియా।శతధృ
తియోరమావరుఁడొశంకరుఁడోశుకుఁడోయటంచున।ద్భుతమునుబొందుచుండ
బరిపూర్ణతనొప్పెధరాతలంబున౯॥క॥ఆనరహరిసద్గురునకు। శ్రీనాగోరా
మగురుఁడుశిష్యుండై విజ్ఞానంబునఁబ్రత్యక్షు। శ్రీనారాయణుడనం బ్రసిద్ధి వ
హించె౯॥శా॥రాజన్మౌతులలోఁడఁజెంపెసగు వైరాగ్యోపరత్యాసులుం
జేజంబొప్ప సహాయలై మెఱయుసద్దివ్య ప్రబోధస్ఫురద్రాజాస్యన్స్వరియిం
చు మోక్షసుఖసామ్రాజ్యంబుతోనొప్పె నా।గోజీరామగురుండు పండితులు
గోర్కుల్ దీఱసేవింపఁగ౯॥క॥ఆనాగోరామునకు౯। శ్రీనారాయణునకజు
నిదెలుపునభక్తుం । డై నెగడనెల్లదిక్కులఁ। గోనేరుగురుండుతత్త్వకోవిదుఁడ
గుచు౯॥శా॥ఆకాశీతల సేతుమధ్య కలితజ్యాధీశ్వరోస్త్యధికశ్శ్రీకోటి వమ
ణి।పభార్చితనిజాంఘ్రిద్వంద్వపం కేరుహుండాకాశాదిసమస్తతత్త్వసను

*సేవాదిశ్రీయను స్థలమునందుసేవానిధి
శ్రీయనివేతొకపాఠముగలదు*

దాయాతీత విశ్వేశుడై। శ్రీకోనేరుగురుండు మోక్షవరలక్ష్మీకాంతుఁడై
రంజిల్లెన్ ॥శా॥ ఆ కోనేరుగురూత్తముంగొలిచి దివ్యాధ్యాత్మ యోగంబు
దా। శ్రీకల్యాణగుణప్రసిద్ధుఁడగుచున్ శ్రీమన్మహాదేవలో। కైకాచార్య
డు సంగ్రహించెనతి సౌఖ్యంబొప్ప సాందీపునిన్। శ్రీకృష్ణుండు భజించి విద్య
లొనరంజేకొన్న చందంబునన్ ॥సీ॥ అఖిలభూతంబుల నాడించు మాయను సొం
పుగా నెవ్వఁడాడింపుచుండు। గురుజనంబుల కెల్ల గురువులై తగువారిహరుల
కెవ్వఁడు గురువగుచుండు। వివిధలోకంబుల వెలుఁగించు వెలుఁగుల మించి
యెవ్వఁడు వెలుఁగించుచుండు। ప్రభువుల కెల్ల సత్ప్రభువైన బ్రహ్మకుఁ బ్రభుఁడౌ
చు నెవ్వఁడు పరఁగుచుండు। సగుణనిర్గుణరూపుఁడై నెగడుచుండు। నమ్మహాదే
వగురువరుని నభినుతింప। సకలనిగమాగమాంత శాస్త్రంబులో పావనఁగ మము
బోంట్లకు నుతింపనలవియగునె॥ గీ॥ అమ్మహాదేవగురు చరణారవింద। పరప
రాగాంశ భజనతత్పరుఁడఁబరగు। రామపంతుల కులజాత రామమంత్రి। మా
ణిక్యమాంబిక ప్రియాత్మజుఁడ నేను। * * * * ॥క॥ శ్రీరామనామమంత్రా

*షష్ఠ్యంతములు,*

కారునకు నసంగనిర్వికారునకు మహా। కారునకు నిజాకారునకు। కారునకజ్ఞాన
భూమికాదూరునకున్ ॥క॥ ధీరునకు భక్తిజనమందారునకు నిరంతరాత్మ్యాదా
రునకు నిరా। ధారునకు సకలజగదా। ధారునకు నవాద్యఖండితశరీరునకున్ *
క॥ వ్యాపకునకుఁ ద్రిశరీరా। లేపకునకు నిజతావ లేపకునకుధీ। దీపకునకు
సచ్చిత్సుఖ। రూపకునకనంత విశ్వరూపాత్మునకున్ * క॥ శ్రీమద్దత్తాత్రే
యమ। హామునిసన్నిభునకు శ్రీమహాదేవగురు। స్వామికిఁ దతసర్వాంత।
ర్యామికి విజ్ఞానభూమి కారామునకున్ * వ॥ సమర్పితంబుగా నాయొన
ర్చెంబూనిన శ్రీసీతారామాంజనేయ సంవాదంబను వేదాంతగ్రంథంబునకుఁ
గథా ప్రారంభం బెట్టిదనిన॥ ..... ..... ..... ..... *

## కైలాసపర్వతాభివర్ణనము-

॥క॥ శ్రీసుఖద శుద్ధసత్త్వావాసము శివపార్వతీనివాసము సుమహా। భాసమవా
భాసము కై। లాసము దనరారుఁ జిద్విలాసంబగుచున్ ॥ వ॥ అదిమరియు నా
దిమధ్యాంత విహీనంబును సజాతీయ విజాతీయ స్వగత భేదశూన్యంబును ని
త్యాపరోక్షస్వప్రకాశాపహసితానంత కోటిసూర్యచంద్రానలాలోకంబు
ను వేదశాస్త్రపురాణేతిహాసాగమాగమ్యంబును బహువిధవర్ణధర్మైక
మగుణనానారూప వికారశక్తివిరహితంబును బ్రహ్మేంద్రాద్యమరాసురో

రగగరుడగంధర్వకిన్నరకింపురుషసిద్ధసాధ్యవిద్యాధరచారణాప్సరోయ
క్షగుహ్యకభూతఖేచరదేవర్షిబ్రహ్మర్షీశ్వరయోగీశ్వరమునీశ్వరయతీ
శ్వరకవీశ్వరాద్యుపాస్యంబును నిత్యనిర్గుణనిర్వికల్పనిర్వికారనిరాకా
రనిరంజననిర్విషయాతీంద్రియావాఙ్మానసగోచరాప్రమేయశుద్ధబుద్ధము
క్తకేవలాఖండసచ్చిదానందమయంబునైనతురీయాతీతపరతత్త్వకైలాసంబు
ననవ్యక్తమహదాదిసప్తావరణపరివేష్టితంబును జతుర్దశలోకకంధరసుందరంబు
ను సార్వభౌమాదిహిరణ్యగర్భాంతానన్తఖండశైలభాసురంబును భానుసోమ
నక్షత్రతారాగ్రహపావకసౌదామన్యాదివివిధతేజోరత్నశకలిలంబును
బ్రవిమలవైరాగ్యోపరతిశాంతాత్యంతముముక్షుతాధిక్యకాధ్యాత్మానంద
జీవాభిషిక్తనిర్మలనిశ్చలతాకలికాకలితఫలితనిష్కామకర్మోపాసనాయాగ
యోగజపతపస్సత్యశౌచదయాశీలవ్రతదానాదినానావిధానేకపుష్పోద్యా
నవిరాజితంబును బుద్ధ్యుపేతనిగమాగమాంతకల్పలతావిలసితంబును శుద్ధ
సమాధిసౌధవిభ్రాజితంబును బరమాధ్యాత్మవిద్యానందజలాభిషిక్తనిర్మ
లచిత్తవృత్త్యంగశమదమోపరతితితిక్షాశ్రద్ధాసమాధానామానిత్వాదం
భిత్వాదికల్యాణగుణమణిగణరంగవల్లీప్రకాశితంబును నిరతిశయకైవల్యఖాం
డాగారశోభితంబును ఫలకామనాభావస్వభావనియతకర్మాచరణచిత్తశు
ద్ధిసర్వకర్మపరిత్యాగగురుభక్తివేదాంతశ్రవణమనననిదిధ్యాసనజ్ఞానా
దిసోపానసమన్వితవిజ్ఞానరాజమార్గలలితంబును బంచాక్షరీమహాయంత్ర
మాణిక్యతోరణాలంకృతంబును బ్రణవనాదమంగళవాద్యరవపూరితంబును
నగుతురీయమహాస్థానమంటపాంతరంబున సర్వోపనిషత్సారభూతబ్రహ్మా
త్మైకత్వదర్శనరూపోంకారసింహాసనాసీనుండై శుద్ధసత్త్వప్రధానమాయా
మయదివ్యశోభనవిగ్రహుండును సర్వజ్ఞత్వసర్వేశ్వరత్వసర్వాంతర్యామి
త్వసర్వస్రష్టృత్వసర్వరక్షకత్వసర్వసంహారకత్వాద్యగణితసమగ్రసుగుణ
పరిగ్రహుండును సత్యజ్ఞానానందస్వరూపకుండును సర్వవ్యాపకుండును దేవ
దేవుండును నగు శ్రీమహాదేవుండు మూర్తిమంతంబులై చతుర్వింశతితత్త్వంబు
లును నిచ్ఛాజ్ఞానక్రియాదిశక్తులును హృషీకేశ్వరవాణీశ్వరసురేశ్వరనం
దికేశ్వరభృంగీశ్వరవిఘ్నేశ్వరకుమారాదిప్రమథగణాధీశ్వరులును బ్రాహ్మీ
మాహేశ్వర్యాదిసప్తమాతృకలును స్వసాన్నిధ్యంబున నిజకరుణాకటాక్షవీక్ష
ణంబున వేక్షించి కొలువ స్వస్వరూపావలోకంబు సేయుచు నాత్మారాముడై
యున్నసమయంబున దదీయవామార్ధశరీరిణియుం బరాపరప్రకృతిస్వరూ

ణియునిఖిలజగదు పాదాన కారణభూతయు నఖిలలో కైకమాతయుఁ ద్రి
వన గేహినియు విశ్వమోహినియు ధీముఖజ్ఞానవిజ్ఞానలోచనయు విషయ
క్తధరయు విచారమందస్మితయు నిగ్గమతానిర హంతాహ స్తయు యోగ
ోధ స్తనియు సందేహామధ్యయు సంసారచక్రనాభియు రాగద్వేషజఘన
ముఁ గామలోభోరుయుగళయు సంకల్పవికల్ప చరణయుఁ గాలానుతక
యానయు వేదాంతవిద్యావ్య సనవసనోపరతి కంచుకధారిణియు రజ
త్వతమోగుణ గంధినీ వీబంధకంచుకబంధ వేణీబంధసుందరయు ఫలత్యా
పూర్వక వర్ణాశ్రమోచిత ధర్మానుష్ఠానేశ్వర ప్రణిధానాచార్యోపాస
క్రియాత్మవినిగ్రహస్థిత ప్రజత్వాదిసాత్త్విక గుణభూషణాలంకారిణియు
ద్వాసనావాసితయు నిత్యానపాయినియు దేవదేవియు నను శ్రీమహాదే
యతి ప్రీతిపూర్వకంబుగాఁ జతుర్విధశుశ్రూషలుగావించుచు సేవించు
బూజించుచు భావించుచు నమస్కరించుచు నారాధించిన బ్రసన్నుం
యిఁ మెచ్చి నీకు నెయ్యది యభీష్టం బిచ్చెదననుగు మనినసంతోషభరితది త్త
మెయిమ్ముల కాశిని ఁ బునవ్వునవ్వుచునిట్లనియె ॥ గీ ॥ ప్రాణనాథతనమప
నిగొల్పుటకంటె । వేరెపనులు గలవె చాకునుతికిఁ । గాననీదు సేవగావిం
మయు గాని యొండుకోర్కి లేదఖండమూర్తి ॥ గీ ॥ అయిననీకభీష్టమదు
మిచ్చెదమని । యానతిచ్చితి మహాత్మ యిపుడు । గాననాదునెల్ల మానవు
ము మేలు గలుగనొకటియదు గవలసెననఘ ॥ క ॥ నిఖిలకలుషనంతయకర ।
ఖిలాభీష్టప్రదంబసితావ్యయబి । త్సుఖదము జగదధిపత్యభి । ముఖకరమగు
మంత్రరాజముఁగృపఁజెపుడా । ..... ..... ..... ...

*శివుఁడు పార్వతీదేవికి రామనామప్రభావంబు దెలుపుట.*

॥గీ॥ అనినవినినవ్వి గిరిజకిట్లనియె శంభుఁ । డదుగరాని రహస్యార్థ మడిగి
తి । నగనదినమదీయ నిక్షేపమగుపదార్థ మైన నెఱిగింతునీకు నెయ్యంబుతో
॥గీ॥ శ్రీమనోరామశ్రీరామ రామరామ । యనుచు రమియింతు రాముని యం
। రామనామము వరానన సహస్రనామతుల్య । మట్లుగావునదీని నీవవధరిం
॥క॥ ఆదిపరబ్రహ్మప్రతి । పాదకమత్యంత పరమపావనము సుమీ । యాదివ్య
మంత్రరాజము । మోదితధర్మార్థకామ మోక్షప్రదము ॥క॥ సత్యజ్ఞానా
ందు । ప్రత్యగభిన్నాత్మునందు బ్రహ్మే విబుధుల్ । నిత్యము రమింపుచుండఁగ । గా
త్యాయని రామపదము గలిగెబరునకుఁ ॥ తే॥గీ ॥ రామపదవాచ్యుఁడాదినారా
యణుండె । యతనికినినాదు భేదమింతయునగలుగ । దద్వయబ్రహ్మమయులమ

ట్లగుటవలన। నింతవాయందనేలాచరించి వినుతింపదస్వామీ తన్మంత్రాధిష్ఠాన
రామనామ। మెంతపావనంబెట్టిదియొ తెలింగింపుండనిన నొక్కింతవిచారిం
చాంజాలండననగు॥ దత్పరమేతిహాసంబుగలదందు శ్రీరామతత్వంబతిస్ప
ష్టంబుగను। నారీమణీయతిరహస్యంబుగావున నెవ్వరికిగోచరంబుగాకుండు
రమహోఘంబులేక జెప్పెదవినుమని శ్రీమహాదేవుండప్పార్వతీదేవికిట్లనియె*

నసశశ।తము ——*రామాయణకథాసూచక*——

బులవరత నారాయణుండాత్మ రక్షణపరాయణుండు లోకోపకారార్థ
పాపత । శ్రీరామచంద్రుండయి క్షితిపయి నవతరించి ప్రేమతోసీతను బెండ్లి
పాత్ర డి । సాకేతపురమున సంభ్రమించుచునుండి జగములరక్షింపజనసివర
సే। జనకునివాక్యంబు సమకూర్చ జెలింపఁదమ్ముఁడు భార్యయుఁదానుఁగూ
డి । తాపసుల వేషములుదాల్చి తాల్మిమీఱ । దండకారణ్యభూములఁదగఁజ
రించి । సకలరాక్షసగణముల సంహరించి । యరిగి సీతానిమిత్తము యింత
మీఁద ॥ మ॥ రణభూమిందగ రావణాసురు సపుత్ర భ్రాతృబంధూరువా । రణ
గంధర్వశతాంగయుక్తముగ శస్త్రశ్రేణిచేఁద్రుంచిల । క్ష్మణసుగ్రీవహనూమ
దాదియుతుండయి కాంక్షించి సీతావధూ । మణితోవచ్చి నయోధ్యకార్యులు
నుంపంబుప్వకారూఢుఁడయి ॥ తే - గీ ॥ ఇట్లుకుసుదెంచి రాముఁడు హితపురో
హి । తార్యబాంధవనవభృత్య ప్రభృతులు । ననుజులును గౌసల్యాత్మజుండయి
జనకజాభి । యుక్తుఁడయి యంతఁబట్టాభిషిక్తుఁడయ్యె ॥ సీ॥ శృంగార మే
పారసీతాంగ నామణిముని జవామాంకమున వసింపఁ । దనపాదుకలుశి
రంబున మోచిముందరహను మంతుఁడతిభక్తినమునరింప । ధవళాతపత్రమా
తతధనుర్బాణముల్దాల్చి లక్ష్మణుఁడుకయి దండనలర । నానికగడలవింజామ
రంబులు ఘనాభ రతశత్రుఘ్నులు పరిఢవింప । ననుపమోజ్వలరత్న సింహాసన
మున । నమరఁగూర్చుండి కోటిసూర్యప్రకాశుఁ । డయి వసిష్ఠాదిమునిసమూ
హములచేతఁ । జెలఁగి రాముండు పట్టాభిషిక్తుఁడయ్యె॥

వ* ఇట్లుపట్టాభిషిక్తుండయి శ్రీరామచంద్రుండు హితపురోహితామా
త్య సుహృద్విద్వద్బ్రాహ్మణ దాసదాసీజనంబులకును నానాదేశాధీశ్వరు
లకును విభీషణసుగ్రీవజాంబవత్సుషేణనలనీలగజగవయగవాక్షగంధమాద
నాదులకును వంది మాగధ పాఠకలోకంబునకును దక్షిణవారల కందఱకును
నొరథగుఱ్ఱులు దీఅంగగిన రథతురగవారణగోభూహిరణ్యాగ్రహారరత్నది
వ్య వస్త్రాభరణ గంధమాల్యాదులొసంగి సత్కరించి యంతటఁ దనపురో

భాగవతీయుఁ బుణ్యకీర్తియు నిటలతటఘటితాంజలియును గృతకార్యుండును నిరాకాంక్షుండును నిత్యానిత్యవస్తువివేకయుక్తుండును సకలవిధైహికాముష్మికభోగవిరక్తుండును శమాదిషట్కసంపత్తియుతుండును ముముక్షుతా సమన్వితుండును మహాబుద్ధిమంతుండును నైన హనుమంతుం గనుంగొని కరుణారసంబు పొంగారఁ జనకజాంగనామణి నెమ్మొగంబుఁ జూచి మనకు నిత్యభక్తుండును బరమభాగవతశిఖామణియు నైనయితనికి మద్దివ్యతత్త్వస్వరూపం బుపదేశింపు మనిన బంగారంబునకుఁ బరిమళంబు గలిగిన తెఱంగున నుప్పొంగి మందస్మితముఖారవిందయయి విశ్వమోహినియైన సీతామహాదేవి యాంజనేయునికభిముఖియై యిట్లనియె॥ ...

—*సీతాంజనేయసంవాదము*—

సీ॥ సుమతి రాముఁడు నిర్వికారము సదాశుద్ధంబు బుద్ధంబు దిం । త్యను వాచ్యంబతులంబతీంద్రియము సత్తామాత్రముగా స్వప్రకా । శము నిద్వంద్వము నిర్వికల్పమజముగా సత్యంబు విధానందరూ । పము మూర్తిగాఁ బరంబు కేవలపరబ్రహ్మంబు చింతింపఁగా ॥ క॥ అవికారుఁడయ్యుఁ గనకము । వివిధాభరణంబులగుననువిధమున నితఁడే । దివియయి భువియయి రవియయి । కవియై సర్వాత్ముఁడయి ప్రకాశించుఁ బరగ ॥ క॥ త్రిగుణాత్మికయైయనిశము । జగములు పుట్టింప బెంప సమయింపఁగాఁ । దగుమూలప్రకృతియనే । నగదుఁ జూమీ సత్యముగ మహాగుణశాలీ ॥ క॥ అమలుఁడగు నితని సాన్ని । ధ్యమువలన సృజింతు జగమంత్రితనైయి । ట్లమరబుధులచేఁ దత్స్వ । ష్టము గల్పింపఁ బడు సీయ సంగునియందుఁగా॥ ... ... ... ... ...

వ॥ అదియెట్లనిన నాకర్ణింపుము అయోధ్యానగరంబున నతినిర్మలంబయి నరఘువంశంబునం జనిజన్మంబును విశ్వామిత్ర సహాయత్వంబును దన్మఖరక్షణంబును నహల్యా శాపశమనంబును హరధనుర్భంగంబును మత్పాణిగ్రహణంబును బరశురామ పరాక్రమభంజనంబును బురప్రవేశంబును దండకారణ్యగమనంబును విరాధవధనంబును శూర్పణఖ నాకర్ణనాసికాచ్ఛేదనంబును ఖరదూషణత్రిశిరః ప్రముఖరాక్షసఖండనంబును మాయామారీచమరణంబును మయాసీతాపహరణంబును జటాయుకబంధమోక్షలాభంబును శబరీపూజనంబును సుగ్రీవసమాగమంబును వాలివధంబును సీతాన్వేషణంబును సముద్రసేతుబంధనంబును లంకానిరోధంబును భీమసంగ్రామంబున భ్రాతృపుత్రపౌత్రబాంధవహితజనాది సహితంబుగా రా

వ॥ హరణంబును విభీషణరాజ్య ప్రదానంబును బుష్పకారోహణంబును మత్సమేతంబుగా సాకేతపుర గమనంబును రాజ్యాభిషేకంబు మొదలుగాఁ గల కార్యంబు లన్నియు నాచేత నాచరితంబులయ్యె నట్లగుచుండ నిర్వికారుండు సాక్షిమాత్రుండగు నీ రాముని యందజ్ఞానులచే నారోపింపఁబడుఁగాక॥

ఉ॥ రాముఁడు నిర్వికారుఁడు నిరామయుఁ డవ్యయుఁ డచ్యుతుండు నిష్కాముఁ డతీంద్రియుండు జడకర్త యభోక్త యసంగుఁ డంతరా । రాముఁడు నిర్వికల్పుఁడు నిరంజనుఁ డద్వయుఁడయిన యాపరం । ధాముఁడు గాని చారుగుణధాముఁడు గాఁడు సమీరనందనా ॥ క॥ మాయాగుణానుగతుఁడయి । పాయక నానావిధ ప్రపంచం బితఁడే । సేయునని తోఁచు నేమియుఁ । జేయఁడసంగుండకర్త సిద్ధము వత్సా॥ ... ... ... ... *

వ॥ అనిన విని హనుమంతుండు సీతాదేవి కిట్లనియె-

గీ॥ రామచంద్రుండు తారక బ్రహ్మమగుట । సత్యమగుఁ గాని యిన్మహా సర్వమయుని । సులభముగఁ గాంచు పరమ సుసూత్ర మెద్ది । నాకెఱింగింప మ్మలోకైకజనని॥ ... ... ... ... ... *

వ॥ అనిన విని నవ్వుచు సీతాదేవి హనుమంతున కిట్లనియె-

గీ॥ ప్రత్యగాత్మస్వరూపుఁడయి పరగుచున్న । రమణఁ బరమాత్ముఁడయిన శ్రీరామునకును । సమరసైక్యానుసంధాన సరణి యెద్ది । యదియ యోగంబు సదుపాయ మాంజనేయ॥ ... ... ... ... ... *

వ॥ ఆ యోగం బభ్యాసయోగంబు - జ్ఞానయోగంబన ద్వివిధంబై యొప్పు - నం దభ్యాసయోగంబు ప్రాణాయామంబన విలసిల్లు - నదియుఁ బ్రాకృతంబును - వైకృతంబును - కేవలకుంభకంబు- నన ద్రివిధంబయ్యె - నందు బ్రాకృతంబు మంత్రయోగంబు - వైకృతంబు లయయోగంబు - కేవలకుంభకంబు హఠయోగంబు - నీత్రివిధ ప్రాణాయామయోగములకు - యమ నియమాసన ప్రాణాయామంబులు పూర్వాంగంబులు - ప్రత్యాహారధ్యానధారణా సమాధు లుత్తరాంగంబులగు - నందహింసా సత్యాస్తేయ బ్రహ్మచర్యాపరిగ్రహంబులు యమంబులు - శౌచతపస్సంతోషస్వాధ్యాయేశ్వర ప్రణిధానంబులు నియమంబులు - వీరాసన - స్వస్తికాసన - పద్మాసన - యోగాసన - కూర్మాసన- భద్రాసన - సిద్ధాసన - సింహాసనాదికంబులగు- చతురుత్తరాశీత్యాసనంబుల - నీవుఁ డించితి నభ్యసించి - యాఁగతటంబ్రాణ నిరోధంబు సేయుందగు - నంతస్స్వభావనిఃశ్వత రేచక - పూరక కుంభక క్రమం

బులచేత - నేకవింశతి సహస్ర షట్ఛతాధిక సంఖ్యాజపమంత్రానుష్ఠానంబు
మంత్రయోగంబు - ప్రతిదివసాభ్యస్త రేచకాది త్రివిధానిలక్షయమనపూర్వ
కంబుగాఁ - బ్రాణవృత్తియందపానంబును - నపానవృత్తియందుఁ బ్రాణం-
బును - లయంబుగావించుటలయయోగంబు - మూలబంధోడ్యాణబంధ
జాలంధరబంధపూర్వకంబుగా - రేచక పూరకంబుల నుడిగించి ప్రాణాపా
నంబుల రెంటిని రేయింబగలొక్కచందంబునఁ గుంభించుట హఠయోగంబిది -
త్రివిధప్రాణాయామంబు - విషయంబుల వలన నింద్రియంబులమరలించుట
ప్రత్యాహారంబు - సగుణనిర్గుణాత్మకవస్తుచింతనంబు ధ్యానంబు - మూ
లాధారాది దేశంబులఁ జిత్తంబు నిలుకట్టుట ధారణాయోగంబు - నిర్మలని
శ్చలచిత్తవృత్తి నిర్గుణబ్రహ్మత్వంబు సంపాదించుట సవికల్పనిర్వికల్పాత్మ
కసమాధియోగం - బిట్లష్టాంగయోగంబు ప్రకాశించు - నదియ పరిపక్వచి
త్తులకు యోగ్యంబిది - యణిమాద్యష్టైశ్వర్యములనొసంగుచు - నాత్మజ్ఞా
నంబు ప్రకటంబుగాఁ జేయు - మఱియుఁ బ్రవిమలచిత్తులకు - జీవబ్రహ్మైక్య
జ్ఞానమాత్రంబునిచ్చు - నతిసులభంబయిన విజ్ఞానయోగంబు - రాజయో
గంబనంబడు - నీరెంటికి శ్రీరామచరణకమల భక్తి కారణంబు - దానికివయి
రాగ్యంబు మూలంబు - వినుము * శా॥ ప్రత్యక్షావగమంబుఁ బావనమున
భ్యాసంబుగావింపఁగా । నత్యంతోరు సుఖంబు ధర్మమతిగుహ్యంబుత్తమం
బాద్యమ్మై । నిత్యంబాగమసిద్ధమాదిమ నిరాటంకస్తుత్యము న్వేద్యము । న్ని
త్యానందము రాజయోగమనుమహానిర్వాణమార్గంబుగా ॥ గీ॥ రాజగుహ్య
మైన రాజయోగంబును । శ్రద్ధధానులగుచు జనములెల్ల । సంశ్రయింపలేక
సంసారవనధిలో । మునుఁగుచుండ్రుగురువిమూఢులగుచు ॥ క॥ ఈ రాజయో
గమార్గం । బీరేడు జగంబులందు నెవ్వారెఱుఁగరా । త్మారామలసదహం
గా । పారకృపాయుక్తులకును భక్తులకుం దక్క ॥ గీ॥ రాజయోగంబు ముక్తి
కి రాజపథము । రాజగుహ్యంబు పరమంబు రాజవిద్య । యగియు మూఁడు వి
ధంబులనలరుచుండు । సాంఖ్య తారకసమనస్కములనంగ ॥ గీ॥ తారకంబు
మనశ్శుద్ధికారకంబు । సాంఖ్యమాత్మస్వరూపవిచారకంబు । ననుభవజ్ఞానమ
మనస్కమట్లుగాన । నాద్యమెఱిఁగింతు మొదలనీవవధరింపు ॥ ఉ॥ తారక
ముగ్ర భవాంబునిధి తారకమంబుజసంభవాదిబృం । దారకసన్నుతంబఘ
విదారకమందితర రాగరోషసం । హారకముం బ్రధాన పరిహారక మాత్మసు
ఖానుభూతివి । స్తారకమాగమాంతసువిచారకము తనరారు మారుతీ ॥ క॥

తారకయోగముఁదెలియఁగ । నేరక వేదాంత వాక్యనికురుంబముచే । నూర
కవాదించుచుండెదరు । వారికి మోక్షంబుగలదె వాయుసుమా ॥ గీ ॥ రాజ
యోగంబుపూనినిరంతరంబు । పటుగానభ్యసింపఁగఁ బ్రాలుమాలి । కొన్ని
వేదాంతయుక్తులుగూడఁబెట్టి । పఠనకనేర్చిన బ్రహ్మానుభవముగలదె ॥ సీ ॥
దారుణగాఢాంధకారంబడంగునే వసుధపయుగ్రతదీపవార్తవలన । వాఁకొన్న
మనుజునియాఁకలిదీఱునే ఘనరసాన్నవర్ణనమువలన । నెఱిఁబేదవానిపే
దఱికంబువోవునే ద్రవ్యప్రభావవర్ణనము వలన । రోగపీడితునిబలురోగంబు
దీఱునే కలితౌషధప్రసంగంబువలన । జండిపడిబుద్ధిలో వెలినిండిమిగుల । దట్ట
మైనట్టి యజ్ఞానతమముదెసనె । తర్కిత విచిత్ర శబ్దబోధంబువలన । ఫలిత
యోగానుభవసృష్టివలనఁ గాక ॥ క ॥ యోగాభ్యాసమువలనస । దాగతిది
త్తేంద్రియములదర్పములడఁగుఁ । రాగద్వేషాదులు చను । బాగుగనాత్మ
సుఖానుభవముంగలుగుఁ ॥ ..... ..... ..... ... *

—*తారకభావము,*—

వ॥ అట్లుగావునఁదారకయోగాభ్యాసంబుముముక్షునకవశ్యకర్తవ్యం
బట్లగుటఁదత్ప్రకారంబెఱింగించెదసావధానచిత్తుండవయివినుము ॥ చ ॥ వన
రుచునేమియుండిననివానికిమిక్కిలివెక్కసంబుగాఁ । దినియెగఁబోయువాని
కినిదీఱనినిద్రగయొల్ల ప్రొద్దుఁబై । కొనఁబడియుండువానికినిగొంకక రేవగలొక్క
రీతిమేల్కొనివసియించువానికిన గోచరముల్పరయోగలక్ష్యముల్ ॥ క ॥ యు
క్తాహారవిహారుఁడు । యుక్తస్వప్నావబోధుఁడు యుక్తకర్మములఁ । యుక్త
విచేష్టుండగుఘన । యుక్తునకగుఁబరమరాజయోగముసుఖమై ॥ సీ ॥ వితత
మయివిజనమయివిమలమయి సుఖమయిపానంగువివిక్తదేశమ్మునందు । సమ
భూమియందుసశ్ఛలముగా మిట్టపల్లములు గాకుండఁజేలవముగాఁగ । పరు
సఁగుశాజినవస్త్రంబులనువు గాఁబఱిచియొప్పంగవానిపయింగిరముగ । బూ
నిపద్మాసనాసీనుఁడయియామీఁదఁగా యమధ్యమముసుగళముశిరముఁ । జక్క
గానిక్కి దృక్కులుముక్కుచక్కి । జిక్కఁదక్కించితక్కినదిక్కుఁగనక । మిక్కి
లిచలేంద్రియంబుల స్రుక్కఁజేసి । ఫలితముగయోగముభ్యసింపఁగవలయుఁ॥

మ ॥ యతచిత్తమరుద్ధశేంద్రియతనువ్యాపారుఁడయిమానియై । హాఁ
కామాదివికారుఁడయి గతభయుండయిబ్రహ్మచారివ్రత । స్థితుఁడయి శాంఁ
మనస్కుఁడయి స్వగురుమూర్తిప్రోక్తలక్ష్యైకధ్యానం । గలియామధ్యాయన
భ్యసింపఁదగు యోగంబుం దలోద్యోగుఁడై ॥ క । ప్రకటియునునిరాశియ

నేకాగ్రమనస్కుఁడు నజితేంద్రియుఁ డత్యం । తైకాంతవాసియై యుటిఁ । జే
కొనివరయోగమభ్యసింపఁగవలయుఁ ॥క॥ మూఁడుతియూనియమంబులు। తా
రకసాంఖ్యామనస్కతత్త్వగులయసా । ధారణములగుచు వెలయుం । దార
క యోగులకతి ప్రధానములందుఁ॥ ..... ... ..... *

## —*పంచముద్రలు*—

క॥ వరునస్ఖేచరియసభూ । చరియనమధ్యమయనంగషణ్ముఖియనఁగా ।
వరశాంభవియనఁగలవీ । ధరలోపలముద్రలయిదు తారకమునకుఁ ॥గీ॥ సద్గు
రూపదేశసరణిచేసి చైదు । ముద్రలను విశేషముగ నెఱిఁగి । యభ్యసింపవ
లయునటమీఁదఁ దారకంబొందుఁ బ్రణవనాదబిందుకళల॥వ॥ అవియెట్లంటేని॥
గీ॥ కనులు మూసియైనఁ గను విచ్చియైన భ్రూ । మధ్యమునఁ జూపు నిలుపని
లిపి । యూర్ధ్వముఖముగాఁగ నొనరఁ జూచునది । ఖేచరియనుముద్రికేశవ
ద్య॥క॥ లోచనములు కదలింపక । నాచాఖ్యే క్షస్వనాసికాగ్రం బెపుడుఁ ।గో
చరముగఁ జూచిననది । భూచరియనుముద్రయగును బోధశరణ్యా॥ గీ॥ కనులు
సగముమూసి ఘననాసికామధ్య । సీమయందుఁ జూపు చెదరనీక । నిలిపిమీఁద
నున్ననిటలంబుఁ గాంచిన । మధ్యలక్ష్యమగుఁ గుమారతిలక ॥గీ॥ కర్ణలోచన
నాసాయుగంబు మూసి । మలఁది భ్రూమధ్యమునఁ జూపులును మనము ।
నిలిపి వగ నాదబిందు చిత్కళలఁ గనుట । షణ్ముఖీముద్రయండ్రు సజ్జనులు వత్స॥
క॥ అంతర్లక్ష్యము బహిర । త్యంతవినిశ్చలయగు దృష్టియసగతపవన।స్వాం
తవికారము గలయది । వింతయగుచు నొప్పు శాంభవీముద్రయనఁ ॥ మ॥ అమ
రేంద్రార్చితపూర్వపశ్చిమనితాంతర్బహిర్మధ్యల । క్ష్యములుద్యద్ద్వ
రమండలత్రయకళాసందర్శనాఖ్యాసయో । గ్యములీరెండును నాదబిందు
రుచిసాక్షాత్కారసద్ధేతుభూ । తములైయొప్పు నిరంతరంబలఘుతేజోధ్యా
నంబుగావించినన్ ॥గీ॥ నాదబిందుకళలనయ మొప్పఁ జూచుచు । నింద్రియ
ములమనమునిపుడఁ జేసి । సత్కవీశ్వరుండు స్వప్రకాశాత్మ ది । త్సుఖముఁ
గాంచుఁబరమసులభముగను ॥చ॥ లలితనినాదబిందుకళలన్ గుఱిచేసినమా
న సేంద్రియం । బులు వెలిలోపలం దిరుగఁబోవక వాసనమూచుచుండని। శ్చ
లమగు దేహమయ్యెడవిచారము చేఁబరమాత్మతత్త్వముఁ । సులభముగా నె
ఱుంగఁబడునమ్మిదిచక్కనిత్రోవయారయన్ ॥గీ॥ నాదబిందుకళలనాదరిం
పనియోగి । యింద్రియములు మనమునిట్టునట్టు । పసువులిడఁగవానిఁబట్టజా
లకనుందు । నిట్టివాఁడు పరము నెట్టుగాంచు ॥సీ॥ గాలంబులేని చోజాలకా

గ్రణి చేతఁబారీనజాలముల్పట్టువశమె । సరియుగలేఁబోశశ వాంతశనిచే
తఁజొక్కఁంపుపతులు చిక్కఁవశమె । యోగంబులేనిచో నాగిమావటనిచేఁ
గజరాజములుసరికట్టువశమె । తగువలలేనిచోమ్మృగభూనోదిచేఘోరమృ
గంబులు కొట్టువశమె రాజితానందతారకరాజయోగ । పావనస
మాధిలేనిచోఁబరమశివుఁ । తగఁ వేదాంతవాదతత్త్వకలచేత । నింద్రియ
మనంబులువినిగ్రహింపఁబశమె ॥క॥ జనమంజనంబుఁగైకొని । ఘనమగుధ
నమును నెలుంగుకైవడినినిరఁ । జనతారకయోగముచే । కొనిపరతత్త్వము
నుదెలియగుఁజీవశునంతర్ ॥గీ॥ పలలమునుజూపిడేగనుబట్టురీతి । నమృతస
మనాదబిందుకళాంభూతి । సుఖమునొందించిమఱిగించిచొక్కఁజేసి। యిం
ద్రియమనంబులను నిగ్రహింపవచ్చు॥ ... ... .. ... *

——*నాదానుభవము.*——

క॥ వేదనుట్లుగాననాదబిందుకళౌను। భవముదెగిపెమొదలబండితులను
దత్త్వరీకారమల్లగ నెఱిగించెద।విస్తరించి తెలియవినుమువత్స॥ గీ ॥సద్గురుప్రో
క్తముద్రచే శ్రవణయుగము।మూసియాలింపఁబ్రణవంబు మ్రోయుమొదల।జి
ణిమనుచునంతటఁ జిణిజిణియటంచు।మించి రెండవమాఱు ఘోషించునఘ
శా॥ కంటి న్నెమ్మదిఁగంటిసద్గురుని సింక న్నేసిలోపుష్పలా । ఘంటంబూజలోన
తూనంచుగరమర్థిన్ దేహిడామున్నగా । ఘంటానాదము జేసె న్మోయన
గ నోంకారంబుహృన్నిధియు । న్మించన్నోరియుఁదదారవంబుగతియామీఁ
దన్ విజృంభించుచున్ ॥స్రగ్ధర ॥ కామక్రోధాద్యవద్రాక్షు సగణవిజయా
కాంక్షియై పత్యగాత్మ । [illegible]మన్నారాయణుండఁతవిమలమహావిత్తశంఖం
బునిండ । న్నేమంబారంగఁబూరించినగతి మొఱయుంజిత్తశౌదర్శకంబై ।
భూమానందప్రదంబైస్ఫుటసిగను శిరోభూషణోంకారమతన్॥ మ॥ నలువొ
ప్పందగుబ్రహ్మదండి నొకవీణాదండమున్జేసి వ । ర్ణలజాతంబుల మెట్లుగాని
లిపిపంచప్రాణముల్ తంత్రులయి। యలరంగాఁగొనిముక్తికామినిసహ స్రా
రంబునందుండినిచ్చలువాయించెననంగనొప్పు ప్రణవస్వానంబుదానంతటన్॥
తోటకవృత్తము * అమృతాంగనబోధనుయాత్మనిశు । ధ్యమనఃపవనం
బులు తాళముగా । నమరంగొనిపాడుచువాడినయ । ట్లమలప్రణవారవమం
తఁదగన్ ॥సీ॥ సలలితేంద్రియగోపికలువక్రప్రీతిచేఁజను దెందతనుఁబొందినసం
తసింప । బ్రహ్మదండిల తావిభాస్వదాధారాదికపికావళీమహావికాసమొంద।
బ్రస్ఫుటీకృతపటుస్ఫుటఁ గుండలీంద్రుఁడత్యానందకరముగానాడుచుండఁ ।

బొందుగా భ్రూమధ్యబింబం దావ నమ్మనఁ బ్రత్యక్షబోధ గోపాలమూర్తిఁ ।
విమలమానసపవనహస్తముల చేతఁ । దనసుషుమ్నా మురళిలీలఁ జాల్చి మధుర ।
గానమొనరించెననఁగ నోంకారమలఘు । వేణునాదస్వరూపమై వెలయు నంత ॥

సుగంధివృత్తము ॥ క్రూరరాగరోష వైరి కోటి నెల్లఁ ద్రుంపఁగాఁ । గో
రియాత్మ గాముఁడుండ ఘోరసంగరార్థమై । భూరి భేరి కారవంబు భోరు
కొల్పినట్టులోం । కారనాద మొప్పఁబింత గాఁ గుమారయంతటన్ ॥ మ ॥ అమ
రేంద్రాదులఁ గెల్చు సోంపలరు మాయాకాంత నాడింపఁగా । నమరాత్ముండ
గు నల్లమా ప్రభువు నంద్రాత్మీయ విద్యామృతం । గమువాయించెననంగ నొప్పు
లలితోంకారస్వనంబంత హృ । ద్యము చింత్యంబగు లంబవాచ్యము నిత్యానం
దమౌ ఘుమారుతి ॥సీ॥ సిఖిలోం క్రియములను నీలకంఠంబులత్యంతసంతోషనృ
త్యములు సలుప । ధర్మామృతార్ద్రీకృతమనోవనీస్థలీశమముఖ సుగుణసస్య
ములిగుర్ప । సమరసానందనిర్ఝరము చేఁదాపదావానలం బెల్లఁ జల్లార్పఁ బొ
డగ । భ్రూమధ్యదేశనభోవీథిఁ జిత్రశోభావద్విల్లతాతతుల్ వెలయుచుండఁ ।
సతతచిదాకాశమధ్య సంగతసమగ్ర । రాజయోగ సమాధి ధారాధరంబు ।
మోదవర్షంబు గురియుచు మ్రోసెననఁగఁ । బ్రణవ దశమని నాద మొప్పా
రనంత ॥ వ ॥ * ఇట్లు - చిణీనాదంబును - జిణిజిణీ నాదంబును - ఘంటానా
దంబును - శంఖనాదంబును - వీణానాదంబును - తాళనాదంబును - వే
ణునాదంబును - భేరినాదంబును - మృదంగనాదంబును - మేఘనాదంబును
ననంబరగుదశవిధప్రణవ నాదంబులను - శ్రీగురూపదేశపూర్వకంబుగా శ్రు
తియుక్త్యనుభవంబుల చేత - నెఱుంగవలయు నుటయును ॥గీ॥ భూరినాదం
బకారంబు పుణ్యపుగుప । విమలబిందువులనుకారము గపేంద్ర । కళ మకార
మీమూఁడును గలియఁగూర్ప । ఘనతరోంకారము గుసదాగతి కుమార ॥

వనమయూరవృత్తము * గౌరవయుకారమును కారముమకారం । బా
రయఁగఁగూడి యొకయక్షరము వాచ్యోం । కారమనఁగా నిఖిలకారణము నై
ఘం । టారవము కీర్తి హృదయాబ్జమున మ్రోయున్ ॥ క ॥ హృదయసదన
మునఁ బొదలెడి । సవమల నాదామృతంబు చవిగొనకున్నన్ । మదిఁగదలుచు
గుదురదుగలు । గదు మొదలిడిపదముమున ముగమఁదుదయమైకొ నాదము
నంచితపరమా । హ్లాదము చిత్తప్రసాద మపగతగురుసం । వాదము గతభేదంబ
ని । వేదంబులు పలుకు వేదవేదాంతజ్ఞా ॥గీ॥ ప్రణవనాదరసామృతపానరతుని ।
విమలనయనములనిమిషత్వమువహింప । మనసు దేవాలయంబున మసకిమఱిఁ

గీ ॥ సలలితకళావిభూతిచే వెలయుచుండు * సీ ॥ అణిమఘుండ జరుండ నమృతుండ పటుశక్తిధరుండ సిద్ధుండ విద్యాధరుండ । యోగీశ్వరుండ సాధ్యుండ నింద్రుండను శుద్ధసమవర్తియును బుణ్యజనుండ భువన । పతియును వరసదాగతియును సుకృతార్థుండ భవుండనంతుండ నఖిలమిత్రు । డతికళాశాలిమహా బుధుండు కవీశ్వరుండును సుమనో గురుండు ఘనుఁడు । హంసవాహనుండు నచ్యుతుండు శివుండు । పరమపురుషుఁడగుచుఁ బరఁగుచుండు । బవన తనయ వినుము ప్రణవనాదామృత । పానతృప్తుఁడయిన మానవుండు ॥ గీ ॥ ఆంజనేయ యింకనంతర్బహిర్మధ్య । దృగ్విలోకితప్రదీప్తచిత్క । ళావిభూతి యెల్ల భావించి చెప్పెద । నాదరించి చూడు మాత్మయందు ॥ గీ ॥ కనులు రెండు గురుని యనుమతిఁ గొని మూసి । భ్రూమలనడుమ ద్విదళకమలమునను । విమలదృష్టినిల్పి శనులలితాత్ముఁడై । చూడవలయు లక్ష్యశోధనములు॥ ... ... ..... ..... ..... *

→→→ * చిత్కళాసాక్షాత్కారము. * ←←←

క ॥ మునుపుగ హృదయాకాశము । గనుపట్టుం జూపులకును గన్నుల వెంట । జ్ఞానునది మనమరిగావునఁ । గనఁదగు నాకాశపంచకం బందుఁ దగన్ ॥

వ ॥ ఇట్లు తనలోచనంబులకుఁ గనుమాపు మేరగోచరంబయిన హృదయాకాశంబునందు - కేవలనిరాకారంబయిన గుణరహితాకాశంబును - నిబిడనిష్ఠురనీరంధ్ర గాఢాంధకారాకారంబయిన పరాకాశంబును - ప్రళయకాలప్రజ్వలజ్వాలాభీలదావానలాకారంబయిన మహాకాశంబును - వివిధవిదిత్రవితతాపరితాపరిమితద్యుతిభరితంబయిన తత్త్వాకాశంబును - బ్రచండమార్తాండమండలశతకోటిప్రభా భాసురంబయిన సూర్యాకాశంబును ననుపంచాకాశంబుల నవలోకింపవలయు - మఱియును * గీ ॥ ఆంజనేయ వినుతదాకాశపంచక । మధ్యమమున వెలుఁగు మహితకళల । చందమెల్లనీకు ముందుగా వినుపింతు । సందియములు మానిపొందు వాని, ... ...

సీ ॥ మందాకినీసుధాసందోహదుగ్ధాబ్ధిసౌందర్యలహరుల చందమునను । మందారమల్లికాకుందారవిందోరుచనదనపుష్పగుచ్ఛయము పగిది । నిందిరాసుందరీ మందిరాంతమణికరండనిర్ఝరరుచిప్రతతిరీతి । నిందుభృన్నందిఫణీంద్రసంక్రందవకరిసింహగీష్పతిబృందముల భాతి । హారనీహారడిండీరశారదాభ్ర । హీరకర్పూరతారకాకారకాంతి । కరణి నాకాశపంచకాంతరమునందు । మండితములగుఁ జిత్కళామండలములు ॥ మఱియును * సీ ॥ సద్య

స్తమోనాశఖద్యోతమానసద్విద్యుల్లతా ప్రభా వీథివగిది । హృద్యక్షపావే
ద్యుఖద్యోతసందోహవిద్య మానద్యుతివితతికరణి । ఘోరాంధకారకృద్ధూ
రినీలసవారివారివాహచ్ఛవి ప్రజమురీతి । నీల వయిదూర్య ప్రవాళాబ్జరాగ
మౌక్తా ఫలగోమేధికములభాతి । శుద్ధమాణిక్యమరకతశోణరత్న । తప్తతప
యఃసుచుల చందమునహృదయ । మండితాకాశపంచకమధ్యమమునఁ । గా
నఁబడుచుండెఁజిన్మయకళలువత్స * శా॥ చండాంశు ప్రభలుట్టి పడ్డగతి భా
స్వచ్చిత్కళాకోటులు । ద్దండస్ఫూర్తిర్జ్వాలఖండఖండములునయితండోపతం
డంబులై । నిండారంగనుపట్టువేఁడియును హృన్నీరేజమధ్యాంచితా। ఖం
డాకాశపరంపరాంతరము ల్సమ్యంబులయ్యెంతటన్ * సీ॥ తరుణబోధా
రుణోదయదీప్తి నజ్ఞానతురుతమ స్సుజ్ఞహృద్గృహాలనడఁగ । ఫుల్లషడ్జలజాత
ములమీఁదనిక్కుహంసము ద్రివేణీసంగమమున మెలఁగ । వినుతేంద్రియేందీవ
రములెల్లముకుళింపమనమును శశిసుఖవనధిజాలు । సలలితజ్ఞానవిజ్ఞాన కోకం
బులన్యోన్యసంగతములయియనఁగిపెనఁగ । నాతతాజాండపిండాండ జాత
ములను । బూని వెలిఁగించు పటుతరస్ఫూర్తితోడ । ఘనతరాంతర్హృదా
కాశమున వెలుంగు । నుండితాఖండచిద్భానుమండలంబు ॥గీ॥ సకలకర్మ
ములకుసాక్షియైస్వప్రకా । శతఁ దమోఘ్నుఁడగుచుఁ జతురాది । కప్రవ
ర్తకత్వగరిమభాసిలుసత్స్వ । భావుఁడగుచుఁజిద్విభావసుండు ॥క॥ భ్రూ
మధ్యోన్నయశయిలము । పయి మొకలందోఁదయంతఁబ్ర విమలహృదయ ।
వ్యోమారూఢుండింద్రియ । తామరపానంజకరుఁడుదానయి వెలుఁగున్॥

సీ॥ అంతకుమున్నెసీవపరోక్షవిజ్ఞానచతురువుల్ దెలిసియజ్ఞాన మోహ ।
నాంగితాదాత్మ్యరూపాలింగనముమానిచయ్యనఁదనువనుశయ్యడిగ్గి । చాను
వయిరాగ్యవిజ్ఞానోపరతులచే మానసస్నానకర్మములుదీర్చి । యనిశంబు
భఃథేంద్రియప్రేరకుండెవ్వఁడా దేవసవితృమహాప్రకాశ । మెలమి నేనంచు
లోచనాంజలులచేత। ఘనతరానందబాష్పకాష్ఠ్యఁబులిచ్చి। మొదలసందే
హమందేహముఖవగప్ర।గాశమొనరించియంతవానంచమల॥క॥మానజపము
నిర్వృతి ।ధ్యానముఁగావించి యక్రియాత్మాచర్చనముం । బూనిమొన
రించిదివిఖిం । దానందంబనుభవింపుమయ్యమహాత్మా॥ గీ॥ అట్లఖండసుఖా
మృతావాప్తిఁజెంది । చిత్తవిశ్రాంతితాం బూలసిద్ధిఁగాంచి । మురిసి యస
మానమూర్తివయిముక్తికాంత । తోవినోదింపవయ్యవాతూలతనయ॥

సీ॥ కామ్యాదిఖగముల గజిబిజులడఁగ దేహాత్మాభిమానారణ్యఁడ స్తమిం

ప । సలయవిక్షేపకషాయరసాస్వాదధీంద్రియాబ్జములుని గించుచుండ । విల
సదాత్మాకారవృత్తికయిరవజాతమింపొంది వికసింప నెఱకనుఱవు । [లనుచ
క్రయుగమునకతిః యోగము గల్గఖండవిజ్ఞాననక్షత్రతతుల । తెలివివెల్వెలఁ
బోవనిర్మలమనశ్చ । కోరతృష్ణానలంబుచల్లారనతి । ననితరముగహృదా
కాశమున వెలుంగు । మండితాఖండచిచ్చంద్రమండలంబు॥ ... *

వ ॥ అయ్యవసరంబున - సుషుమ్నాంతఃపురంబున - నప్రమేయతురీయశయ్యాతలంబున - హంసయానయు - దుర్నిరీక్ష్యకళాభాసమానయు - మూలాధారమణిపూరక కింకిణీసమన్వితయు - స్వాధిష్ఠాన కాంచీకలాపయు - హృదయకీలితానాహతరత్న భూషితయు - గంరవిభ్రాజితవిశుద్ధమంగళసూత్రాలంకృతయు - భ్రూమధ్య ప్రకాశ మానసదమలద్విదళ లలాటికా శోభితయు - సూర్యచంద్రమండల తాటంకయుగళ విరాజితయు - ధగద్ధగాయమాన సౌదామనీలతాశరీరిణియు - శుద్ధసత్వమయ మాలావృతయు - సచ్చిదానందస్వరూపిణియు - నయినముక్తికాంతను - యోగజ్ఞానకరంబుల గాఢాలింగనంబుచేసి - నానావిధప్రణవనాదంబులను - కంకణమేఖలామంజీరశింజితకళరవమణితాద్యారవంబులు చెలంగ విచారజనితజ్ఞానానందరసమధురాధరామృతంబను భవించుచుఁ - బరమ శయనంబను దియెచె మటవ్రేమ - నిర్నిద్రాతునుద్రముద్రాలస్య దృగ్వచనను సోహం భావజ్ఞానంబుల నేకరూపంబులుగావించి - వితతాపరిమితానుపమిత పరమోపరతిసుఖ...ఖండవును - సమాత్మరతుండవును - సంస్పృష్టాగ్రాంతమమునస్థానుండవును - సంతతోదితానంతచలానందకలుండవగుచు - బ్రహ్మబిందుమండవుడునయి - యానందింపుము ॥ గీ ॥ ఆత్మపాలితి చెంగిమయంతతేజపతి । సుఖములను జెలంగిను రుచిరాత్మ । నమరతులను బొంగి సంస్ఫూర్ణకామునకు । రాజభోగివనముగరాజయోగి ॥ గీ ॥ ఫాలమునను సృష్టిపమయాఖండలీంద్రమండు । మసకమునఁజంద్రమండలంబు । నమరనమృతమయుతహాత ధర్మకామార్థ । పమండను మా త్రిపురహరుండవగుచు ॥ చ ॥ తొలుతననాదికాలకృతదుష్కృతపుణ్యవిమిశ్రకర్మకోటులను సమిచ్ఛయంబులఁ గమున్ప్రసితంబుగఁ జేయుచున్నవు । జ్వలసవఖండసద్వరసువర్ణమయామలకివ్యవహిన్నమం । డలము వెలుంగు నంతటపిడంబితహృద్గగనాంతరంబునన్ ॥ మ ॥ ఉరురాగాదిగుణాజసంఘమును నాద్యోంకారమంత్రంబుచే । తగయుంబాపవధిందియాత్మ విపయేధ్మశ్రేణితోఁగూడఁజే । ష్ఠ్వర నానావిధ వాసనాజ్యములతోఁజివ్హాహ్ని

మధ్యంబునఁ । వకుసన్వేలిదిసౌఖ్యసోమరసపానంబంతఁగావింపవే ॥గీ॥ అ
మ్మహాబ్రాజ్వలసూర్యసోమాగ్నిమధ్య। సీమయందంతఁగనుపట్టుశీతధామ।
చండధామానలాత్త్రకాఖండధామ । మండితాదిహిరణ్మయమండలంబు॥

వ॥ అనిమతియును ॥సీ॥ మహనీయవయిశాఖమధ్యాహ్నకాండసంకలిత
మార్తాండమండలముపగిదిఁ । జారునర్మలశరత్సమయరాకాసముజ్జ్వల
పూర్ణచంద్రమండలముభంగిఁ। దృప్తహేమాభిదీప్తజ్వాలికాజాలపిలయుకా
లాగ్నిమండలమురీతి । నీలతోయదమధ్యనిగతతకనీయ విలసత్సౌదామనీల
తికభాతిఁ । బరగనీవారశూకంబుకరణిసూక్ష్మ। మైవిమల మైయవర్ణమ్మయి
ప్రమేయ । మైయదంష్ట్ర ప్రకాశమైయలఘుచుంచుఁ । జెండగుచుఁ లహిరణ్మయ
మండలంబు॥క॥ అదియాపోజ్యోతియనం । గదలకద్వాదశమునదనరకలయామీఁ
దఁ । మొదటిటివెలుఁగువెలుంగున। ల్లదెయాత్మారామతత్త్వమగు ననిలసుతా॥
మత్తకోకిల॥ కోటిసూర్యులుఁగోటిచంద్రులుగోటికోటితటిల్లతల్ । ల్యాటి
గాబరిపాటిగానొకచోటఁసల్పనరీతిన । మ్మేటివెల్గునగంబ్రకాశము మీరఁజూ
డనుదృశ్యమున్ । దాటినాయనుమాటిమాటికిఁదాలిచేనబుమీటుచున్॥

వ॥ ఇట్లు - భ్రూమధ్యవీథియందు - హృదయాకాశంబునంగనుపించు •
వియన్మండల - తమోమండల - మేఘమండల- విద్యున్మండల- తారామండల-
జ్యోతిర్మండల - సూర్యమండల - చంద్రమండల- వహ్నిమండల- హిరణ్మయ
మండలంబులను - దశవిధమండలంబులఁ - బూర్వోక్తదశవిధనాదంబులను -
వక్ష్యమాణ బిందుకోశాత్మకహంస తత్త్వంబును - మహాకాశ మధ్యంబునఁ
గనుపించుజీమూతంబులచందంబున - నెవ్వనియందుఁదోఁచు - ననలాది భూత
చతుష్టయంబును - దత్కార్యంబులను - నంటనిమింటిపగిది నిన్నింటినెవ్వం
డంటకుండు- నా నిత్యుండఖిలరూపంబులఁ బ్రకాశింపంజేయకయువడి నెవ్వండు
చిన్మాత్రుండై యున్నండని వేదవ్యాస విభజించియుండును - నతండే బిందునాద
కళాతీతస్వప్రకాశనిత్యశుద్ధబుద్ధముక్తపరిపూర్ణసచ్చిదానందస్వరూపప్ర
త్యగభిన్నపరమాత్మారాముండను - విశుద్ధసత్త్వప్రధానయుఁ - బరమవయిరా
గ్యబోధోపహితస్వరూపిణియు - బిందునాదకళాత్మికయు - గేవల బ్రహ్మాత్మై
క్యవిద్యామయయునయిన - నన్మాశ్రయించి - యద్వితీయాపరోక్షబ్రహ్మచై
తన్యస్వరూపకుండయిన - యీయాత్మారామునియందాత్మాకారాకారిత
వృత్తిగతచిదాభాసకుండవయిననీవు - ప్రచండాతపమధ్యనిక్షిప్తదీపకళికవిధం
బున - జ్ఞానకర్మేంద్రియపవనమనోవృత్తివిలయపూర్వకంబుగా - నేకీభూ

తుండవయు - నివాత దీపంబు భంగి - నిస్తరంగసముద్రంబుపోలిక - వికతాశేషపర్ణపాదపంబు చాడ్పున - నీలపీతాదివర్ణశూన్యగగనంబుకరణి స్వప్నజ్ఞానపునరుత్థాన విరహితసుషుప్తిరీతి - నిశ్చలుండవును - నిశ్శేషుండవును - నిశ్శబ్దుండవును - నిర్వికల్పనిరాకారసుఖస్వరూపకుండవునునయి బాహ్యాభ్యంతరంబులు మఱచి - నిరూపమరాజయోగతురీయసమాధిఁ బొందుమని - యుపదేశించి - వెండియు నిట్లనియె॥ ... ... *

తే - గీ॥ అట్టిప్రాణసమాధిమనోనిలములు। చలనముడుఁగక కానిగోచరముగాదు। యవియుబిందువుచాంచల్యమడఁగకున్న। నిశ్చలంబులుగావు వినిశ్చితాత్మ॥ తే - గీ॥ అట్టిబిందువుచాంచల్యమడఁగి దెంచు।హంసతత్త్వంబు నెఱుఁగకయట్లుగాన। దానివివరింతువినుముదిగానఁబడిన। గాలిబిందువుమనమునుగదలకుండు॥ తే - గీ॥ కంజపుంజానుగతిసౌఖ్యగతుల మెఱసి। యాతతబ్రహ్మసంస్థానమగుచులలిత। మానసానందరమయిసమత్వమమర। సత్యగతినెప్పునీహంసచక్రము ఘ॥ ఆ - గీ॥ వినుముపాలునీళ్లువిభజింప నేర్చిన। పరమహంసపక్షిఁబ్రవిమలతాఢ్య। పరమహంసుఁడయినపరమహంసుడసార। సారములనుబంపఁజాలుననఘ॥ తే - గీ॥ చటులసంసారదుఃఖనాశనకరంబు। హంసతత్వార్థవిజ్ఞానమతిరహస్య। మట్లుఁగావునఁజెప్పెదనవధరింపు। పరమభాగవతోత్తమభక్తవరద॥

—*హంసతత్త్వోపదేశము.—

వ* మాతృపితృభుక్తాన్నసంభూతరక్తశుక్లబిందుజనితంబయి - త్వగ్మాంసరుధిరమజ్జాస్థిస్నాయువులనుషట్కోశికంబులుగలిగియొప్పు - నీస్థూలశరీరంబునందు - డెబ్బదిరెండు వేలనాడులుగలవందు - గుదంబునకంటె రెండంగుళంబులమీఁదట - లింగంబునకంటెరెండంగుళంబులక్రిందటఁ - కన్యకాయోనిసన్నిభంబయి - యధోముఖాగ్రంబయి - మూఁడుకోణంబులునగు - దేహమధ్యమస్థానంబున మూలాధారచక్రంబలరు, నది మొదలుకొనిసహస్రారంబుతుదగాఁ - బృష్ఠభాగంబున - వీణాదండంబుభంగి - సమస్తనాడికామూలకందంబయి - మూలోర్ధ్వచ్ఛిన్నవంశాభంబయి షడాధారసమన్వితంబయియుండు - దీర్ఘాస్థి బ్రహ్మదండియనంబరఁగు - నాబ్రహ్మదండి మూలాధారాగ్రకోణస్థయై - కుండలీనామపరాశక్తియుక్తయై - ప్రాణాగ్నిబిందునాదనిలయయై - సావిత్రీసరస్వతీనామికయై - బ్రహ్మరంధ్రగతయై - సుషుమ్నానాడి ప్రవర్తిల్లుఁ - దద్వామదక్షిణపార్శ్వంబుల

యందాధారంబు మొదలుకొని - నాసికాగ్రపర్యంతంబు వ్యాపించి - నా
డీచక్ర సంస్యూతలయి - పితృయాన - దేవయాన - సంజ్ఞికలై - చంద్ర
సూర్యమండలంబులం బొంది - యిడాపింగళలను నాడు లొప్పుచుండు- నా
భిమెరెడలంబు నాశ్రయించి - కుక్కుటాండంబు విధంబున నాడీచక్రంబమ
రు - నానాడికలన్నాడి చక్రసముగితలట్లుగావున - గాంధారియు - హస్త
జిహ్వయు నను నాడులు నేత్రాంతవ్యాపినులు - పూషా - లంపూషా నా
డులు - కర్ణద్వయానుగతలు - శుక్లాఖ్యనాడి - భ్రూమధ్యంబునొంది
ఘ్రాణరంధ్రయుగ్మంబును - శ్రోత్రరంధ్రయుగ్మంబును - భ్రూమధ్యమం
డలంబు గివంగలసియుండు - నచ్చో శృంగాటకంబు - చతుష్పథంబు
నన - విలసిల్లు - గంగాయమునాసరస్వతులను పేళ్లుగల యిడాపింగళాసు
షుమ్నలుగూడిన - భ్రూమధ్యస్థానంబు త్రికూటంబనం - త్రివేణీసంగమంబ
నందగు, వాక్ప్రసారిణియైన సరస్వతీనాడి - జిహ్వాంతగామినియగు - వి
శ్వోదరీ నాడి చతుర్విధాన్నంబుల భక్షించు - గంఠస్థయైనపయస్వినీ నాడి,
క్షుత్తృష్ణల నెదవించుచు - జలపానంబాచరించు - నజియు నాడి చక్రసము
ద్భూతలయిన - మూండు నాడు లధోముకలయియుండు - నందు రకాహ్వ
యనాడి శుక్లంబును. సినీవాలీనాడి మూత్రంబును, కుహూనాడి మలంబును-
బహిర్గతంబు గంజేయు - శంఖినీ - దామనీ - నాడులు భక్షితాన్నరసంబు
లు గ్రహించి - కపాలకుహరంబును బొంది - శిరంబున నమృతంబు గావిం
చు నగియుసుంగాక హృదయంబున నేకోత్తరశతనాడులు దనర్చు-నందొక్క
నాడి యూర్ధ్వగామినియగు-నన్నాడిమార్గంబు మోక్షమార్గంబని వేదాంతం
బులు పలుకు - నిట్లు వివరించి చెప్పిన వెల్లముక్య నాడులు -. వీనిలో నిడాపింగళా
సుషుమ్నలు శ్రేష్ఠనాడులగు - నందు బ్రహ్మనాడి సకలనాడీ కాశిరోమణియగు
ని తెలియంగునం - దివ్యగూఢార్థ్వభః ప్రకృతలయుపరమ సుషిర ప్రధానలయిన-
ద్విసప్తతిసహస్ర ప్రనాడుల యందుం-జలన- ధావన కంపనా-కుంచన - శోషణ,
ధమన కంబులయిన - దశవిధ ప్రాణంబులు మెలంగు - నందు హృదయస్థా
నంబున వసియించి - ప్రాణుండిడాపింగళాఖ్యనాడికా రంధ్రద్వయంబు వ
లన్న - నుచ్ఛ్వాసరూపంబు చేత బాహ్యంబునకు నిర్గమించి ద్వాదశాం
గుళ పర్యంతంబరుగు దెంచి యచ్చటనడంగు - గుదస్థానంబు నందుండియ
పానుండు - నిశ్వాసరూపంబు చేతం బ్రాణునకు నధోముకంబున నెదురు
గానగు చుమునధోముకనాడి త్రితయంబువలనమల మూత్రశుక్లంబుల వెడలిం

చుచుండును - కంఠదేశంబున వసియించి - యుదానుండు - మనంబునందు
లి సంకల్ప వికల్పంబులజిహ్వాద్యష్టస్థానంబులవలన - శబ్దరూపంబుగాఁ బలి
కించుచు సుషుప్త్యవసరంబున - సకలేంద్రియంబుల సంగ్రహించి - యుపశ
మింపఁజేయుచు - ప్రబోధసమయంబున వానినెల్లనెప్పటి చోట్లనుంచుచు -
మఱియును లోకాంతరగమనా గమనంబుల సమర్థుండయి యొప్పుచు -
నగ్నిష్టోమమయుండయి - సుషుమ్నారంధ్రంబు నాశ్రయించి - బ్రహ్మరం
ధ్రంబునకుద్గమించుచుండును - సర్వశరీరంబున వ్యాపించి - వ్యానుండు - బా
హ్యశీతోష్ణంబుల నభ్యంతరంబునకు - నాంతరశీతోష్ణంబుల బాహ్యంబు
నకిచ్చుచు - భక్షితాన్నరసంబు - నంతటం బ్రసరింపఁజేయుచుండును - నా
భిస్థానమండలంబున సమానుండు - జఠరానలంబును బ్రజ్వలింపఁజేసి - స్వా
ద్యపేయచోష్యచతుర్విధాన్నంబులం బచనంబుచేసి - యెల్లనాడులకుఁబంచి పె
ట్టు - నాగుండుద్గారంబును - కూర్ముండున్మీలనంబును - కృకరుండు క్షు
తంబును దేవదత్తుండు విజృంభణంబును - సర్వవ్యాపియైనధనంజయుం
డు - మృతంబయినను విడువక - దేహస్థౌల్యంబుఁ బుట్టించుచుండును - నిట్టు
లదశవాయువులతోఁగూడి - దశేంద్రియాన్వితంబును - కామరాగద్వేషా
ది వికారసహితంబును - విషయసుఖగ్రహణంబు కొఱకు - నధోముఖంబును
శ్రవణేంద్రియంబువలనద్వివిధశబ్దంబులను త్వగింద్రియంబువలనఁ - బంచవి
ధస్పర్శనంబును - నేత్రేంద్రియంబువలన - షడ్వర్ణంబులను - జిహ్వేం
ద్రియంబు వలనషడ్విధరసంబులను ఘ్రాణేంద్రియంబువలనఁ ద్రివిధగంధం
బులననుభవించుచు - నిండియు వాక్పాణిపాద పాయూపస్థలతోఁగూడి,
వచనాదానగమనవిసర్గానందకర్మంబుల నొనర్చుచు - మనంబు ప్రవర్తింపఁ
జేయుచుండు - నమ్మనంబునుగరణంబుగాఁ గైకొని - తత్పవనమనోగ్రంబునఁ
గర్తృత్వభోక్తృత్వాదిధర్మ సమేతయైన బుద్ధివిలసిల్లు - నిదియె బిందు
వనంబడుఁగు - నదిసర్వ కార్యకారణాశ్రయయును - నిఖిలవాసనావాసిత
యును - నగుటంగావున - నమ్మానసమాగు తేంద్రియ శరీరంబులతోఁగూడి -
విషయాభిముఖియై - తచ్చాంచల్యంబువలనఁ - దానునుం జలించుచు -
బహిరంతర్విషయానుభవంబు చేయుచు - సుషుప్తియందజ్ఞానాకారంబగు
చు - జాగ్రత్స్వప్నంబులయందు బుద్ధ్యాద్యాకారంబయి తోఁచుచు -
ననాదికాలంబుననుండి - ముక్తిపర్యంతంబనంత కర్మంబులాచరించుచు -
తత్ఫలంబులగు సుఖదుఃఖంబులు భుజించుచు - నవిచారరూపిణియై - నిరం
తరపర్యటనశీలయైయుండు - మఱియును॥ ... ... ... *

క॥ ప్రతను ప్రాణమనోగ్ర । స్థితబుద్ధియొబిందువందుఁ జెలఁగెడియాత్మ|
ప్రతిబింబ మెకళపవనో । న్నతఘోష మనుమ్ము ప్రణవనాదము వత్సా॥

క॥ ఆనాదబిందుకళలం । గానంబు సేయుచుండు వానిఁగనుపుకుఁడే ప్ర ।
జ్ఞానఘనుఁడయినరాముఁడు । నానావిధతత్త్వములకు నాధుఁడు పుత్రా॥

సీ॥ అట్టి శ్రీరామతత్త్వాభాసకళతోడ నెనసిన యాబిందు వెల్లప్రొద్దు। మాతాండచంద్రాగ్నిమండలాన్వితసూక్ష్మచక్రముగ్రములకు సహితధోము । కంబుగానున్న హృత్కమలంబుతోఁ బహిముఖమయిన్న విషయానుభూతిఁ గలిగి। మానకపవమానమానసేంద్రియదేహ సంగతినూరకసంచరించు| నట్లుగావున దశనాడికాంతరగ్న । దశవిధేంద్రియ పవన చిత్తములనెల్ల । హంసతత్త్వసంభవమునఁ జనఁ నిలిపి । యచలముగఁ జేయుమంతట నాంజనేయ॥

గీ॥ ఇంద్రియములని గ్రహించి ప్రాణములతో । మానసమునఁగూర్చి వానితోడ। హంసయనగనొప్పు నక్షరద్వయమునో॥ జింపసంతతముభజింపవలయు। వ॥ అదియెట్లంటేని॥ సీ॥ అసితంబుపద్మాసనాసీనుఁడయి చూపులమరంగ నాసికాగ్రమునసిలిపి । యింద్రియముల నెల్లనిట్టట్టుపోనీక నుదిచేతఁ దిరముగాఁ గుదియఁబట్టి । ప్రాణాదిదశవిధపవనంబులను వికారములంటకుండఁజోక్కముగనునిచి । కామరాగాదిసంకల్పవర్జనముగా స్వాంతంబునకసిశ్చలము చేసి । యనిలమానసములతోడ హంసమంత్ర । మమరఁగూర్చి జపించుచునంతమీఁద । హృదయనభమునబిందువు గనలకుండఁ । బెంపుగా నాదకళలవీక్షింపవలయు ॥ గీ॥ నాదబిందుకళలకాధిమైద్రష్టయై । సర్వదృశ్యమునకు సాక్షియగుచుఁ । జిత్స్వరూపమయిన శ్రీరామతత్త్వమా । నమలనుగుహాకారమాంజనేయ ॥ గీ॥ మహితదేహేంద్రియ ప్రాణమానసాది । దృశ్యరూపిణియై జడాత్మికయుఁ ద్రిగుణ । కలితయునవాదియుమహావికారియైన । ప్రకృతియగును సకారంబు పరమ పురుష ॥ క॥ వినుమాపురుషప్రకృతుల । ఘనతాదాత్మ్యంబు సధ్యాతబిందువుగా । పునహంసయనఁగజీవుం । డనిలమనోయుక్తుఁడగుచు నతఁడు వెలుఁగున్|

వ॥ ఇట్లునిర్వికారుండయినపురుషుఁడనను - గేవలజడాత్మికనప్రకృతికిని- బ్రత్యేకంబుగాఁ - గర్తృత్వభోక్తృత్వాదిరూపసర్వసంసారంబు ఘటింపకట్లుగావున - హకారస్వరూపకుండయిన యాత్మయందాత్మశక్తియైన సకారంబుతో - నన్యోన్యతాదాత్మ్యధ్యానరూపంబునంగూడి - హంసస్వరూపకుండయిన జీవుఁడు - నవద్వారపురంబునం బ్రవేశించి - వివిధేంద్రియ ప్రా

ణమనోయుక్తుండయి - పంజరాంతరంబున మెలంగు పులుంగు లెఱుంగు నఁజిక్క - వెడలనుపాయంబుగానకుండియు - నానావిధభోగంబులను భజించుచుం - గ్రీడించు - నట్టిహంసకునగ్నిసోములు పక్షంబు - లోంకారంబు శిరంబు - త్రినేత్రంబుముఖంబు - రుద్రరుద్రాణులుచరణంబులయి యొప్పార - భానుకోటిప్రతీకాశంబయి - కాష్ఠంబులయందువహ్నియును - తిలలయందుఁదైలంబును - క్షీరంబుల యందాజ్యంబును - వ్యాపించియున్నచందంబున - బ్రహ్మాదిస్తంబపర్యంత సర్వభూతంబులయందు - హృదయకమలంబ ధిష్ఠించియుండు - నందుఁబూర్వదళంబునఁ బుణ్యమతియు - నాగ్నేయదళంబున నిద్రాలస్యాదులును - యామ్యదళంబునఁ గ్రౌర్యశేముషియు - నైరృతిదళంబునఁ బాపబుద్ధియుఁ - బశ్చిమదళంబునఁగ్రీడయు - వాయువ్యదళంబున గమనాదిమనీషయు - సౌమ్యదళంబునఁ రతిప్రీతియు నీశాన్యదళంబున ద్రవ్యాదానంబును - మధ్యంబున వైరాగ్యంబును గేసరంబున జాగ్రదవస్థయుఁ - గర్ణికయందు స్వప్నంబును - లింగంబునసుషుప్తియుఁ - బొందుచుండు - మఱియు నయ్యప్పుడు పద్మత్యాగియగు - నప్పుడు నాదంబున విలీనంబగు - నదితురీయం - బన్నాదంబాధారాదిబ్రహ్మరంధ్రపర్యంతంబు - శుద్ధస్ఫటికసంకాశంబయి - నిండియుండునదియె పరమార్థతత్త్వరహస్యంబని - యోగీశ్వరులచేతఁజెప్పంబడు - నట్లగుటం జేసి॥

క॥ దేశికనాథునిమహోప । దేశమువలనన్వివేకదృష్టివలనన్ । వాన్నశస్థలముసుషుమ్నా । దేశంబనిదానికీలుఁదెలియఁగవలయున్॥

గీ ॥ సర్వభూతహృదయజలజాతముల యందు । సమతఁబవనమానసములతోడ । హంసయనుచుఁ బలుకునతఁడె నేననుకీలుఁ । దెలిసితలఁపనదియుఁబోలియునంత ॥ గీ ॥ ఈరహస్యమెఱిఁగిమేకాగ్రచిత్తుఁడయి । నంతతముభజింపఁజాలునేని । యనిల మానసములు హంసంబుతోఁగూడ । విలయమొందుమొదలిపొలుఁగునందు ॥ సీ ॥ హృదయగత ప్రాణుఁడేతెంచు నాసికావివరంబు వలనన వెలికిద్వాద । శాంగుళపర్యంత మరిరేచకంబగు నగుదెంచునంతలో నర్ధసమయ । మచ్చోటలయమగు నదిబహిఃకుంభకం బారీతిలోపలికరుగు నదియె । పూరకంబన నొప్పుఁబూరించునంతలోనర్ధ కాలంబుదానడఁగునచట । నదియు నాంతరకుంభకంబనఁగఁదనరుఁ । బొసఁగ నిట్లుగిరేచకపూరకాగి । గతులచేవిహరించునీగాని నానిఁ । గలసిమదిలో దశానసయు మెలఁగునపుడు ॥ గీ ॥ పూరకమున హాకారమ్ము పొందుపఱచి

కుంభకంబునబిందువుఁగూడి యంత । రేచకమునసకారంబుఁజూదివానిఁ ।
దెలియు తెలివిరో, నేనని తెలియవలయు ॥గీ॥ ఇట్లనిలమానసములతో నేనసివాం
స ।। యాఱుకమలంబులందునహార్నిశంబు। లీలచేనిరుపదియొక్క వేలయూ
టొ నూటుమాఱులువిహరించు మేరతోడ॥ ... ... *

వ॥ అట్లుగావున - గుదస్థానంబున - వశషసవర్ణగంబును - చతుర్దళ
శయుక్తంబయి - తప్తకాంచన పుష్పసన్నిభంబయి - మహీసిలయంబయి -
ఘ్రాణాకారణంబయి - మూలాధారచక్రంబు విలసిల్లు - నందువినాయకు
నికాఱునూఱులును - లింగస్థానంబున - బభవయరలవర్ణగంబయి - షడ్ద
ళసమన్వితంబయి - రక్తవర్ణంబయి - జలాలయంబయి - రసనాకారణం
బయి - స్వాధిష్ఠానచక్రంబురంజిల్లు - నందుఁజతుర్ముఖుని కాఱువేలును -
నాభిస్థానంబున - డఢణతథదధనపఫవర్ణగంబయి - దశదళోపేతంబయి -
తేజోనివాసంబయి - పీతవర్ణంబయి - నేత్రకారణంబయి మణి పూరకచ
క్రంబు ప్రకాశించునందు శ్రీమహావిష్ణునకాఱువేలును హృదయస్థానంబున -
కఖగఘఙచఛజఝఞటఠవర్ణగంబయి - ద్వాదశదళోపేతంబయి - శ్వే
తవర్ణంబయి - మరున్మందిరంబయి - త్వగింద్రియకారణంబయి - యనా
హతచక్రంబువనరు - నందురుద్రునకాఱువేలును - కంఠస్థానంబు నందకా
రాదిషోడశస్వరగంబయి - షోడశదళయుక్తంబయి - నీలవర్ణంబయి - గగన
సదనంబయి - శ్రోత్రకారణంబయి - విశుద్ధచక్రంబలరు - నందుజీవాత్మున
కుసహస్రంబును - భ్రూమధ్యస్థానంబున - హంక్షమ్మను - వర్ణంబులు
కలిగి - ద్విదళలలితంబయి - మాణిక్యవర్ణంబయి - యంతఃకరణభవనం
బయియాజ్ఞాచక్రంబొప్పు - నందుఁబరమాత్మునకు సహస్రంబును - బ్రహ్మ
రంధ్రస్థానంబున నోంకారవర్ణగంబయి - సహస్రదళశోభితంబయి - కో
టిసూర్య ప్రకాశమానంబయి - నీలయస్థలంబయి - సహస్రారచక్రంబల
రారు - నందు శ్రీగురు స్వామికినహస్రంబును - శ్రీమద్దేశికూటాసనముద్రా
లక్ష్యమంత్రధ్యానక్రమపూర్వకంబుగా - సమర్పించుసద్గురుభక్తుండు - జీవ
న్ముక్తుండగు - నట్లొప్పించునప్పుడు॥ ... ..... ... *

క॥ కుడిమెడమనాడులందుఁ । నడుచున్నాయుభ్రలువానినడుమడివె
లిలోఁ।బొడగనుచు నెపుడు మెలఁగు।న్నడిమినడవనంటి నెమ్మనంబుకుమారా॥

క॥ ఆరెంటికినిబిలక్షణ । మయిరాజిల్లునుసుషుమ్నయందమలాజ్ఞాం ।
భోరుహమునహంసుండా । త్మారాముఁడు సర్వసాక్షియనుచుముహాత్మా॥

గీ॥ అచలహంసరూపమెచట నంభవమగు । నెచట సంచరించు నెచటనడ
గు నదియెసుమి సుషుమ్నయది యెపో ద్వాదశాబ్జ । మదిసుసూక్ష్మదృష్టినరయు
మనఘ ॥ చ॥ అరయ నతిసూక్ష్మదృష్టి యదృగాద్యవసానపథంబు ధీమన । స్స
దనము స్వప్రకాశమున సంగము నిర్విషయంబుగా నస । ప్పదమున హంసనాద
ముల భంగుల గూర్పదదంతరంబునం । దుదయము నొంది చిత్కళమహో
న్నతి వాసినడంచు నెంతయున్ ॥ గీ॥ భూరిహంసనాదపూర్వోత్తరాంశ ।
జనితచిత్కళాగ్నిఘనత మెఱసి । స్వాదివస్తువుల స్వరూపంబుగాఁ । జే
యకను స్నేపమునిఁ జేర్చునపుడు ॥ క॥ అంగము నిర్మలబిందువు । లింగము నా
దంబు పరమలింగాంగమహో । సంగమె మంగళకళయని । లింగాంగులు దెలి
యుదురు చలింపనియుక్తిన్ ॥ గీ॥ అట్లు గానఁ గళయు హంసనాదంబులు । రూ
పమడఁచి తనదు రూపుఁ జేసి । తానుదన్నుఁ గాంచు తత్వంబునం దైక్య । మొం
దుబయలు బయలనొందినట్లు ॥ మ॥ కలహంసాన్విత నాదబిందుకళలుక్రం
బెప్పుడౌనప్పుడు । జ్వలకర్పూరశిఖి ప్రణాశముగ నిర్వర్త్యేంద్రియోపేతకా ।
నిల చిత్తంబులు శూన్యమై చనఁగఁ దా నిర్వాతదీపోపమా । చలసచ్చిత్సు
ఖవిగ్రహాత్ముఁడలరున్ సంపూర్ణుఁడై యంతటన్ ॥

వ॥ ఇట్లు హంసనాదబిందుకళలతో - సకలేంద్రియసమన్వితమనః ప్రా
ణంబులెప్పుడు - విలయంబగునప్పుడయ్యవస్థ తురీయంబనియు - నున్మనియని
యు - సహజామనస్కంబనియును - జెప్పనొప్పునట్టి పూర్ణనిర్వికల్పస
మాధియందద్వితీయాపరోక్షస్వయం ప్రకాశ మానాఖండసచ్చిదానందస్వ
రూపపరమాత్మారామ చైతన్యమాత్రుండవై - యుండు మనియుపదేశించి -
వెండియు నిట్లనియె ॥ సీ॥ పరమహంసమును రేపగలుఁ జింతింపంగ బిందువిం
దందుఁ గంపింపకుండు । దశవిధప్రణవనాదములాలకింపంగఁ దుదను ఘంటానా
దమొదవి మ్రోయు । బహులక్షలక్ష్యముల్పరికించి చూడంగ సుస్థిరంబై స్వ
యంజ్యోతి యొప్పు । యామస్వయంబు యోగారూఢుఁడయి వానిధ్యానింప
దన్మయత్వంబుగలుగు । నట్టియున్మనియందు మనోనిలములు । వివిధ విష
యేంద్రియములతో విలయమొందు । నిదియెసూ సర్వ వేదాంతవిదితపరమ ।
రాజయోగంబు దేవతారాజవినుత ॥ ... ... .. *

వ॥ ఇవ్విధంబున - బ్రతిదివసంబును - యామస్వయనియమంబుఁదప్ప
క - నభ్యసించిన - నిర్మలనిశ్చలదీప్తవృత్తిగల పురుషునకు - షణ్మాసంబు
లకును - మందప్రజ్ఞునకు సంవత్సరంబునకుఁ - గేవలమూఢాత్మునకు ద్వా

దశవర్షంబులకును - బరమసూక్ష్మతారక యోగసిద్ధియగునని యోగశాస్త్రంబులవినంబడు. - దివ్యజ్ఞాన విజ్ఞానసంపన్నుండయిన యాచార్యునిసాన్నిధ్యంబున వసియించి - స్థానాంగభావాత్మకు శుశ్రూషలు గావించుచు - నిరంతరంబు సేవించు మహాభాగ్యుడగు - నిరంతరాయంబుగా - శీఘ్రకాలంబున - నిర్గుణబ్రహ్మసాక్షాత్కారంబగు సందేహింపవలవదు॥

మ॥ అనిబోధించినవాంజనేయుఁడు తురీయానందముంబొందిచ । యస్సీతాలలనాశిరోమణికిసాష్టాంగప్రణామంబుచే । సెనటంచుంబరమేశ్వరుండు కృపచే శ్రీపార్వతీ దేవికిఁ । వినుపింపన్నిసిరాముఁడేమనియెనావృత్తాంతమ్ముంజెప్పవే॥ ... ... ... .. *

వ॥ అనియడుగుటయు.

చ॥ పరమదయాసముద్రగుణభద్రకరాంచిత బోధముద్రికా । సఖరశతకోటిధామజిత కామసుధాంబుధి సోమవిస్ఫుర । న్నిరతిశయప్రభావఘన నిర్మలభావమహోగ్రభావకం । కరహలిధాతృరూపవిద ఖండకలాప జగత్ప్రదీపకా॥ ... ... ... ... ... *

క॥ జగదింద్రజాలకల్పక । సగుణాగుణరూపపరమసత్యకలాపా । నిగమాగమాంతవినుతా । త్రిగుణాతీతస్వభావదీపితభావా॥

మాలినీ॥ కలుషచయవిరామా ఖండితాశేషకామా । సులభసుఖవిచారా సూత్రచేతోవిహారా । విలయజననమారా విశ్వరూపా వికారా । సలలిత శుభకీర్తి సచ్చిదానందమూర్తీ॥ ... ... ... *

గద్య * ఇది - శ్రీమన్నారాయణమహాదేవగురు కరుణాకటాక్ష వీక్షణవిమలీకృత నిజహృదయ కమల కర్ణికాంత స్సందర్శితాఖండ సచ్చిదానందరసైకస్ఫూర్తి షట్చక్రసీతారామ మూర్తి పరశురామ పంతుల లింగమూర్తి గురుమూర్తి ప్రణీతంబయిన శ్రీసీతారామాంజనేయ సంవాదంబను యోగశాస్త్రంబునందుఁ దారకయోగానుభవవిచారంబునునది,

——*ప్రథమాశ్వాసము.*——

*శ్రీరామచంద్రపరబ్రహ్మణేనమః.*





# సీతారామాంజనేయసంవాదము.

## ద్వితీయాశ్వాసము.

క॥ శ్రీదత్తాత్రేయగురు । ప్రాదుర్భూతాపరోక్షపరమజ్ఞాన । శ్రీర
యుతమహాదేవమ । హాదేవాచార్యనమితామరవర్యా॥ ... *

వ॥ అవధరింపుము శ్రీమహాదేవుండమ్మహాదేవికిట్లనియె.

క॥ శ్రీరాముఁడపుడు శ్రీసీ । తారామముఖంబుఁజూచి తత్సమయోదమహా
కారుణ్యకటాక్షముచే । మారుతవరసుతునిఁ గాంచి మందస్మితుఁడై॥

గీ॥ తెలిసెనయ్య సీతాదేవి దెలియఁజెప్ప । గలిగె తారకయోగప్రకార
మెల్ల । నింకనీవు గురుణచే నెఱుకపడితి । సాంఖ్యయోగంబు వినుమా ప్రసం
గమనఘ * వ॥ సాంఖ్యమనన్యంబు - లుపనిషదర్థప్రతిపాదకంబు లందు,
దొలుత సాంఖ్యంబు తేటపడ వివరించెద నిశ్చలచిత్తుండవై వినుమని యిట్లనియె॥

### —బ్రహ్మస్వరూపనిర్ణయము.—

సీ * ఏకమయి పరమయి నిశోకమయి సత్యమలోకమయి వ్యాపకాలో
కమగుచు । జ్ఞానమయి జగదధిష్ఠానమయి ముక్తినిధానమయి మాయాపహీన
మగుచు । నందమయి కేవలానందమయి సంతతాస్పందమయి శ్రుతిపద్మకంద
మగుచు । సారమయి చిదచిదాకారమయి యతినిర్వికారమయి నిగతసంసార
మగుచు । జిలుగు మెలపుల*కలకలఁగుదికికొనుచు॥ మెలఁగు ప్రకృతినిఁదగు
లకమిగిలి వెలుఁగు । వెలుఁగుల వెలుఁగఁజేయుమఁగలయ వెలుఁగుఁ । బరమ
పరిపూర్ణనిర్గుణబ్రహ్మమనఘ॥ ... ..... ...

అదిమఱియును ॥ క॥ నిష్కారణ మునిరీహము । నిష్కాంపము నిష్క్రి
యంబు నిష్కల్మషము । న్నిష్కాళము నిష్కళంకము నైష్కర్మ్య ప్రాప్య
నిర్గుణబ్రహ్మ మగున్ ॥ క॥ దానాదానవిహీన । జ్ఞానాజ్ఞాతీతకనత్యానం
దజ్ఞాప్రధానతజ్జ్ఞని । ధానాధిష్ఠానమానసధామదీవా ॥ క॥ ప్రస్థానత్రయి వే
ద్యుఁడ । వస్థాత్రయసాక్షి సర్వవస్తుస్తోమాం । తస్థుండ స్థిరవిశ్వభావస్థిత్యం
తాదిమూర్తి వాయుకుమారా ॥ పంచచామరము॥ ఇలాజలానలానిలాంబ
రేందుభానుమండలీ । జ్వలాఖిలావిలామలాత్మజాలకాంతరస్థచం । చలా
చలావిలాసమాన్యసంతతాపరోక్షధీ । తత్కళాకలాపలాలిత ప్రకాశకుంప

* ఇచ్చటకలకలుగలుగుకొనుచు- అనియొకపాఠముగలదు.

తండగుఁ ॥క॥ ఆద్యుండవిచ్ఛేద్యుఁడ । విద్యావిద్యాంతద్యుమణిసువిద్యా
సద్యో । వేద్యుఁడుగగుశతరా । భేద్యుండనవద్యుఁడగున భేదాత్ముఁడజా ॥

క॥ భూతానుభూతమిథ్యా । భూతాద్వైతమయపంచభూతోత్థజగ ।
జ్జాతేశుస్ఫూర్తాజా । ద్వైతాత్ముఁడతండు వాయుతనయమహాత్మా ॥

క॥ భావాభావమయావి । ర్భావతిరోభావరహితభావుండవ్యా । భా
వస్వభావుఁడతులవి । భావసుపావకసుధాంశుభాప్రదుఁడగుఁ ॥

క॥ ఆపదముపద్యవిలుప్తా । లిప్తవ్యాప్తపదీపగింగరహితసం । ప్రా
ప్తాప్రాప్తహీన । క్షితిమొసర్వప్రపంచసాక్షిమహాత్మా

క॥ వ్యక్తంబవ్యక్తాది । వ్యక్తావ్యక్తాతిరిక్తముగుబ్రహ్మముదాఁ । బ్రాక్తన
కృభాక్తముయుత । భోక్తనుసతతంబుసాక్షిపోలికఁజూచుఁ ।

గీ॥ జాగ్రదాదివిసగ్రహాను గ్రహాప । తిగ్రహసమగ్రజాగరూకాగ్ర
హోగ్ర । విగ్రహోగ్ర గసాభాసవిశ్వహేతు । ధీప్రకాశకుఁడతఁడెసందే
హమేల ॥గీ॥ ఇదియునదియునట్టిట్టిదింతంతని । పలుకరానిదద్దిబ్రహ్మమగు
నే । యిదియునదియునదియునట్టిట్టిదింతంతని । యరయు తెలివియనఁదె
యనవియునదియె ॥ గీ॥ అట్టిపూర్ణతత్త్వముబునట్టినేను । పూర్వ
కల్పాంతమునసీయపూర్వవిశ్వ । జననమునకంటె మునునిరంజనుడనగుచు ।
నద్వయుఁడనై వెలుంగుదు వాంజనేయ॥ ... ... ... *

—*మాయాస్వరూపనిర్ణయము-*—

గీ॥ అట్టివాయుందవాదిగా నాత్మశక్తి । యలరునవ్యక్తమయిజగదాదియ
గుచుఁ । గలితమృత్తికయందున్నకలశశక్తి । యేర్పడకకుంభహేతువైయున్న
సినట్లు * సీ॥ వటబీజమునమహావటమహీరుహశక్తియుజ్జ్వలవహ్నియందు
ష్ణశక్తి । యింద్రజాలకునియందెపుడు మాయాశక్తికలితోపలములందుఁగఠి
నశక్తి । సలిలజాతములందుసలలితద్రవశక్తిపవనంబునందతిస్పందశక్తి । పొరి
శుక్లశోణితంబులయందుఁదనుశక్తిగుశరీరములజైతన్యశక్తి । దనరియవ్యక్త
మగుచుఁదత్సన్నిధాన । మైయధిష్ఠానమునకంటె నసితరంబునగుపగిదినొప్పు
వాయందునాత్మశక్తి । యేర్పడకనన్యమైవిశ్వహేతువగుచు॥

సీ॥ సత్తుగాదాత్మవిజ్ఞానంబుచే నెంగభావమయిబాధింపఁబడుటవలన ।
నెలమిననత్తుగాదేనగ్నుఁడనటంచునజ్ఞానభూతమయియలరుచునికి । సదసత్తు
గాదువిచారింపలేదట్టి ద్రవ్యంబు గాదువిశుద్ధంబుజ్ఞాన । నిరవయవముగాదు
నిఖిలజగత్స్వరూపముచేత మిగులనేర్పడుటవలన । సావయవమును గాదు

దృశ్యము సుషుప్తి। యందడంగినఁదాను సూన్యంబుగాము। మొనరననుభవయా
త్మకముగాదయుక్తమకట। న్వాంజనేయమదీయమాయాతనుంబు॥
గీ॥ అరయనాయునికిఁ గంటె వేఱైనయునికి। లేమిగాన మద్భిన్నంబు గాదవి
ద్య ప్రకృతియజ్ఞానమనిపల్కఁబడుటవలన। గాదు మీదభిన్న మనుమాయ నాది
మాయ॥ క॥ భిన్నాభిన్నముగాదని। యెన్నంగా నెల్ల ప్రకృతి యిట్లగుటను సం।
పన్నులనిర్వాచ్యంబని మున్నుగణించిరి సమస్త మున్ దెలిసి సుతా। గీ॥ అనుభ
వజ్ఞానదృష్టిచేనగయిటుచ్చ మొగిననిర్వచనీయమానుక్తిదృష్టి। చేతలౌకికను
యదృష్టి చేననంత। మగుడలంపమదీయమాయాతమంబు। సీ॥ త్రాడుభుజం
గమైస్థాణువుపురుషుడై రాజిల్లు శుక్తిరజతమగుచు। మరుమరీచికలునిర్మల
సలిలంబులై తోడ్కిమిన్నసితమై తోచునట్లగిది। నద్వయామలసచ్చిదానందమ
యుండనై తనునేనుమిగుల నెఱ్ఱానివలనఁ। దోలుతనసజ్జడదుఃఖాత్మకములై
నజగములయికను పితృజనులకెల్లకృత్రతరాడై వ్రతవిజ్ఞానదృష్టిచేతఁ। బండి
తులుపూర్ణనిర్వాణబ్రహ్మమయుండ। నైననను గాంచినంత నెయ్యదియ
భావ। మగునటియసూమదీయమాయాతనుంబు॥ ... ...

వ॥ అనితీయును - సర్వభూతసుషుప్తిసమష్టిరూపంబును - సమస్తప్ర
పంచవాసనామయంబును - సత్త్వరజస్తమోగుణాత్మకంబును - స్వాం
తస్థానంతకోటిజీవసంఘాతంబును - కేవలజడంబును- మోహాత్మకంబు
ను - సకలజగదుపాదానకారణంబును- నవిద్యావ్యక్తతమస్సుషుప్తిప్రకృతి ప
ళయప్రధానమాయాజ్ఞానాదిశబ్దవాచ్యంబు నైయొప్పుచుండునని- వేండియు॥

గీ॥ ఆదిమధ్యాంతసూన్యమైనట్టిప్రకృతి। యాదిమధ్యాంతములు లేని
దయ్యుఁదోఁచి। యాదిమధ్యాంతహితాత్మఁ దనరుచు। నాదిమ
ధ్యాంతములు గల్గనావరించు॥ క॥ కవియన్మాల ప్రకృతియు। ద్వివిధగు
గును మాయయననవిద్యయనఁగనా। ద్వవిమలసత్త్వత్రిత్రయగు। నవిమల
సత్త్వప్రధానయ దనన్యతగా॥ గీ॥ అమలసత్త్వప్రధానమైనట్టిమాయ। యం
దు దానికధిష్ఠానమైననేను। ప్రతిఫలించితి మేఘసంగత జలముల। మింది
యాకాశమమరబింబించినట్లు॥ ... ... ... *

క॥ మాయాప్రతిబింబంబును। మాయాధిష్ఠానపదముమాయయుఁగూ
డగా। మాయోపాధియైనయీశుఁడ। మాయిశుఁడనతఁడు బ్రహ్మమయుడై
యుంటగా॥ క॥ ఆయీశ్వరుండనేనా। మాయయెసీతావధూటిదిఁడలఁప
మహా। మాయుడనయ్యువశీకృత। మాయుఁడనయియవతరింతుమహీనితనసూ॥

వ॥ ఇట్లు శుద్ధసత్త్వప్రధానమాయోపాధికుండును - సర్వేశ్వరుండు
ను నైన నేను - వశీకృతమాయుండన నట్లుం జేసి - జగంబులు సృజియించి -
తద్రక్షణంబుకొఱకు - మత్స్యకూర్మవరాహనారసింహవామన పర
శురామావతారంబులు ధరియించి దుష్టనిగ్రహశిష్టానుగ్రహంబులనుం గావిం
చితి - యిప్పుడు శ్రీరామరూపంబున నవతరించి - రావణకుంభకర్ణాదిరా
క్షసుల సంహరించి భూభారంబు నివారించితి - యింకనిటమీఁద బలరామకృ
ష్ణబుద్ధకల్కి రూపంబుల నేనవతరింపఁగలవాఁడ - నాచరిత్రంబులు లోకత్ర
యపవిత్రంబులు - భవలతాలవిత్రంబులై యొప్పునని చెప్పి వెండియు॥

—— ఈశ్వరనిర్ణయము ——

సీ॥ సగుణుఁడు హిరణ్యగర్భుఁడనఁ గొందఱు గొందఱిలన్మహావిరా । ట్పు
రుషుఁడటంచుఁ గొందఱు బుధుల్ప్రభుఁడంచు మహేశుఁడంచుఁ గొం । దఱు
శివుఁడంచుఁ గొందఱు వినాయకుఁడంచును గొందఱుం బరా । పరవరుఁ డన్నె
ఱుంగక యుపాస్తి యొనర్పుదు రజ్ఞులై ధరన్ ॥ గీ॥ వినుము నేనీశ్వరుండను
సుపాదాన । కారణమును నిమిత్తకారణంబు । నగుచు నూర్ణనాభిపగిది నొ
ప్పుదు నింకఁ । గార్యమును నేన కపివరేణ్య॥ ..... ... ...

వ॥ ఇట్లు సర్వేశ్వరుఁడనైన నాకు - నవ్యాకృతంబయిన మహానంద
మయకోశంబయిన - సమస్తభూతసమష్టిజ్ఞానంబు కారణశరీరంబు - మ
హాసుషుప్తియవస్థ - బ్రహ్మాదిస్తంబపర్యంతంబులయిన సకలభూతంబులవ
యవంబులు - జగదుత్పత్తిస్థితిలయంబులు వ్యాపారంబులు - వేదశాస్త్రం
బులు నిశ్వాసంబులయి యొప్పునని చెప్పి వెండియు నిట్లనియె ॥ గీ॥ మలినసత్త్వ
ప్రధానయౌ నలయవిద్య । దానియందు నధిష్ఠానమైన నేను । ప్రతిఫలించి
తిఁ గలశసంగతజలముల । సాభ్రనభము త్రఘచ్ఛాయచందమునను॥

క॥ జీవుండను నాతఁడవి । ద్యావశుఁడయి స్థూలసూక్ష్మతనువాసనలన్ ।
భావించుచు సేవించుచుఁ । గేవలము ఘటప్రతీతిఁ గ్రీడించు మెయిన్॥

గీ॥ అతఁడు ప్రాజ్ఞుఁడనంగ నాజ్ఞానమయుఁడనఁ । బారమార్థికుఁడనఁ
బరగుచుండు । వ్యష్టికారణాంగవశుఁడయి సుషుప్తిని । ఖానుభూతిమఱిగి
యనలతనయ ॥ వ॥ ఇట్లవిద్యయు - నవిద్యాప్రతిబింబంబును - తదధిష్ఠానచై
తన్యంబునుం గూడి - జీవుండనం బరఁగు - నా జీవున కానందమయకోశసం
జ్ఞకంబయిన - వ్యష్టిజ్ఞానంబు కారణశరీరంబు - సుషుప్తియవస్థయగు - నా
రెంటియందు నభిమానంబు గలయతండు - ప్రాజ్ఞుండన నొప్పు - నతనికింత

మాత్రంబుచేత జీవత్వంబు - పర్యాప్తంబుగామిం జేసి - తదీయాదృష్టస
హాయపూర్వకసూక్ష్మశరీరసృష్టిప్రకారంబు చెప్పెద - వినుమనియిట్లనియె ॥

గీ॥ అమలసత్వప్రధానమాయాసమన్వి । తేశ్వరుండననేను సృష్టీచ్ఛ
చేతఁ|బూనివీక్షించితితమఃప్రధానమాయ| నఖిలచేతనకర్మసహాయముగను॥

వ॥ ఇట్లుచూచిన నాతమఃప్రధానసమష్ట్యజ్ఞానావచ్ఛిన్నచైతన్యంబువ
లన - శబ్దగుణకాకాశంబును - నయ్యాకాశావచ్ఛిన్నచైతన్యంబువలనస్ప
ర్శగుణకానిలంబును - నయ్యనిలావచ్ఛిన్నచైతన్యంబు వలన - రూపగుణ
కానలంబును - నయ్యనలావచ్ఛిన్నచైతన్యంబువలన - రసగుణకజలంబును
నజ్జలావచ్ఛిన్నచైతన్యంబు వలన - గంధగుణకపృథివియునుంబుట్టె - నివి
యపంచీకృతసూక్ష్మభూతంబులనియును - బంచతన్మాత్రలనియును జెప్పం
బడు - నీభూతపంచక ప్రత్యేకసత్త్వగుణాంశంబుల వలనఁ - గ్రమంబునది
గ్వాతార్క ప్రచేతోశ్వినీదేవతాసమన్విత శ్రోత్ర త్వక్చక్షుర్జిహ్వా ఘ్రా
ణంబులుజనియించె - మిగిలినసత్త్వాంశసమష్టివలన - జంద్ర వాచస్పతిరు
ద్రక్షేత్రజ్ఞదేవతాయుక్తమనోబుద్ధ్యహంకారచిత్తంబులు సంభవించె-నవ్వి
యదాది పంచక రజోగుణాంశంబు వలన - వరుసం దోడన - వహ్నీంద్రో
పేంద్రమృత్యు ప్రజాపతి దేవతాసమేతవాక్పాణిపాదపాయూపస్థలుజన్మించె
దక్కినరజోగుణాంశసమష్టివలన - విశిష్టవిశ్వకర్త - విశ్వయోన్యజ- జ
యదేవతాక - ప్రాణాపానవ్యానోదానసమానంబులుద్భవించె - నివ్వి
ధంబునసుప్రసన్నంబులైన - జ్ఞానేంద్రియపంచకంబును - నంతఃకరణచతు
ష్టయంబును - గర్మేంద్రియ పంచకంబును - బ్రాణాదిపంచకంబునుంగూడి
యేకోనవింశత్యవయవంబులలింగశరీరంబు గలిగె - నీసూక్ష్మదేహంబు వృ
క్షవనంబులభంగి - నొక్కటి వ్యష్టియనియును - సర్వంబును సమష్టియని
యునుం జెప్పనొప్పు - వీనికివ్యష్టిసమష్టిస్వప్నంబులవస్థలగు - నీవ్యష్టిసూ
క్ష్మాంగస్వప్నంబులయందా ప్రాజ్ఞుండభిమానియై - ప్రతిభాసికుండును -
స్వప్నకల్పితుండును - తైజసుండును ననం బ్రవర్తిల్లు - నాసమష్టిసూక్ష్మకా
యస్వప్నవిశిష్టుండనై - యీశ్వరుండనైననేను - హిరణ్యగర్భుండును -
సూత్రాత్మకుండును - బ్రాణుండునునన - సర్వజీవోపాస్యుండనైయుండు
దు - నిదిసూక్ష్మసృష్టితెఱంగింక - స్థూలప్రపంచ ప్రకారంబు వినుపించెద -
వినుమనియిట్లనియె ॥ సీ॥ తత్తత్తమోగుణక భూతములనైదింటినిగ్రమముచే
రెండు భాగములుచేసి । తొలుతఁబంచార్ధాంశములఁబూనివేర్వేఱ దుని

యలునాల్గుగాననుపుపజెడి । ముఖ్యార్థములశేషభూతఖండచతుష్టయము
లనొండొంటినెయ్యమునంగూర్ప । బంచీకృతంబులై పటుతరస్థూలంబులు
యభివ్యక్తంబులయ్యెనొకట । వాయువనంగనవినుమింకవానివలన । నఖిలజ
గములునానాచరాచరములు । బహువిధాన్నంబులును ఘటపటగృహాది ।
సకలదృశ్యపదార్థములుసంభవించె॥ ..... ..... .....

వ॥ ఇట్లు గగనార్ధంబున - వాయు తేజోజలభూభాగంబులను - నని
లార్ధంబున - నాకాశానలసలిలేలాంశంబులును - బావకార్ధంబువలన
నభస్సమీరతోయ ధరణీఖండంబులను - నీరార్ధంబున - వియన్మారుతకృ
శానుధాత్రీశకలంబులను - ధరార్ధంబున - వ్యోమపవనాగ్న్యప్పకరంబుల
తునియలను - జీవాదృష్టసహాయంబు చేతం గూడిన క్రమంబుచేత - శబ్ద
గుణకంబయిన యాకాశంబును - శబ్దస్పర్శగుణకంబయిన పవమానంబును
శబ్దస్పర్శరూపగుణకంబయిన యగ్నియు. శబ్దస్పర్శ రూపరస గుణకంబయిన
యంబువులును - శబ్దస్పర్శరూపరసగంధసమేతంబయిన ధరణియును - బం
చీకృతంబులై - మహాస్థూలంబులై - యభివ్యక్తంబులయ్యె, నిమ్మహాభూ
తంబులవలన - నతల - వితల - సుతల - రసాతల - తలాతల - మహాతల -
పాతాళ - భూలోక - భువర్లోక - స్వర్లోక - మహర్లోక - జనలోక - త
పోలోక - సత్యలోకంబులను - జతుర్దశభువనంబులును - దత్తల్లోకోచి
త జరాయుజాండజస్వేదజోద్భిజ్జరూప చతుర్విధభూతగ్రామంబులును
దత్తత్ప్రాణిభోగ్యాన్నపానాదికంబులును- ఘటపటాదిసర్వపదార్థం
బులును సంభవించె - నంతనట్టియుం గూడి స్థూల ప్రపంచంబును - దీనికివ్య
ష్టిసమష్ట్యాత్మకంబయిన జాగరంబవస్థయును - నందొకొక్కవ్యష్టిస్థూలశ
రీరజాగరంబులయందాలింగదేహోపాధికుండయిన - లై జనుండభిమా
నంబుచేసి - చిదాభాసుండన - వ్యావహారికుండన - విశ్వుండననొప్పు -
హిరణ్యగర్భుండనైననేను సమష్టిస్థూలవిగ్రహజాగ్రద్విశిష్టుండనై - వై
రాజనుండన - వైశ్వానరుండన - విరాట్పురుషుండన - సకలజగదారా
ధ్యుండనై - ప్రకాశించుచుందుము - మఱియు॥ ..... ..

—విరాట్పురుషనిర్ణయము—

చ॥ ధరణిపదంబులుర్వి దివితలంబు శిరము నాకమంతరిక్షముల్ । సురుచిర
వాభిచండకరసోములు లోచనముల్దిశల్ శ్రుతుల్ । ల్పరదహనుండు నెమ్మొగ
ము వాయువు ప్రాణములున్మహావిరా । ట్పురుషుండనైననాకుఁగపేర్పుఁగ

## —జీవేశ్వరైక్యోపదేశము.—

కం॥ కలశాంబువములఁ దద్గత । జలములఁ గడఁ ద్రోయ నాకసము ప్రతిబింబం । బులు లేమి నొకటియై యిమ్ముల నంశ నఖండనమయి యమూర్తంబగుటన్॥

కం॥ ఆవిధమునఁ దనువులమా । యావిద్యలఁ దొలఁగఁ ద్రోయ నంతటిలోనన్ । జీవేశ్వరులు వెలుంగమిఁ । గేవలతత్త్వంబు వెలుఁగుఁ గేశాధీశా॥

వ॥ అని యిట్లుం జేసి.

కం॥ కలశజలప్రతిబింబం । బులకుఁ బిలక్షణమనంగమున మూర్తంబై । యలఘుఘటాకాశము తద । జ్ఞులకు మహాకాశమనియె సుమి వివరింపన్॥

గీ॥ క్రమముతో స్థూలసూక్ష్మకారణములను । సకరజాగరణస్వప్నసుప్తులను । ప్రబలు రటవిశ్వతైజసప్రాజ్ఞులకవి । లక్షణుండగు నాత్మండు సాక్షియగుచు ॥ గీ॥ అతఁడు కూటస్థుఁ డనఁ బ్రత్యగాత్ముఁ డనఁగ । నడురుండ నఁబు కూటండనంగ సాక్షి । యనఁగ విలసిల్లుఁ దాఁ బరమాత్ముఁ డగుచుఁ । బ్రకృతిపురుషుల నటక పరమపురుష ॥ కం॥ జలదజలప్రతిబింబం । బులకు విలక్షణమునంగమున మూర్తంబై । యలఘుమహాకాశము కే । వలమయి వలయుక పిప్రవరభావజ్ఞా ॥ కం॥ జీవసమష్టితత్త్రితయ । యావస్థాత్రితయములకు నఖిలాంత్మకమా । యావి ప్రాణవిరాట్సూత్రుల । సావకిరివాసాక్షిరెపరాత్ముఁ డొప్పున్॥

గీ॥ అతఁడు పరమాత్ముఁ డనఁగ బ్రహ్మంబనంగ । నలఘుపరిపూర్ణుఁడై తనరు మనఁగ నొప్పు । నిర్వికల్పుఁ డసంగుండు నిర్వికారుఁ । డద్వితీయుఁ డనంతుఁ డయ్యాంజనేయ ॥ వ॥ అట్లు గావున * సీ॥ కలశమేఘములఁ దద్గతజలంబులఁ దదీయ ప్రతిబింబద్వయంబు నొకటఁ । గడకుఁ ద్రోచిన ఘటాకాశమహాకాశములకు నేకత్వంబు గలిగినట్లు । వ్యష్టిసమష్టిదేహములకు ధీమాయలను జీవపరమేశులను విచార । దృష్టి చేఁగని నిషేధించినయెడ బ్రత్యగాత్మునకప్పరమాత్మునకును । సమరసైక్యంబు ఘటియించు సిద్ధమనుచు । నఖిలవేదాంతశాస్త్రములు నిశ్చయించు । గురువులిట్లుపదేశింపుదురు బుధులకు । ననఘ యిదియె మతీయుదివ్యాశయంబు॥ ... ..... ..... ..... .... *

కావున * సీ॥ పరఁగ శరావకుంభకనామరూపముల్ద్రోసి మన్నొకటిగాఁ జూచుపగిది । ఘటతటాకములనొక్కట నిషేధించి తద్గతజలమొకటిగాఁ గాంచుకరణి । దీపప్రదీపవర్తియుగమ్ముడందిత తేజంబు నొకటిగాఁ దెలియుభాతిఁ । కలశగృహంబులఁ గడనుంచి వానిలోఁ గలమింటి నొకటిగాఁ గనుచురీతి । బాహ్యజీవేశ్వరస్వరూపోపాధియుగము । ప్రకటవివేకదృష్టిని

రాకరించి । తన పరిపూర్ణశుద్ధచైతన్య మొకటి । గాఁవిలోకింపవలయు
మేధావియనఘ ॥ వ ॥ ఇట్లువ్యష్టిశరీరావస్థాత్రితయంబును - విశ్వతైజస
ప్రాజ్ఞనామకంబులైన జీవచైతన్యంబును - కించిజ్జ్ఞత్వకర్తృత్వభోక్తృ
త్వాది - గుణంబులునుగూడి - త్వంపదవాచ్యార్థంబు - దేహత్రయ
విలక్షణంబును - నవస్థాత్రయసాక్షియుఁ - బంచకోశవ్యతిరిక్తంబును-సచ్చి
దానందస్వరూపంబును నైన - కూటస్థచైతన్యమాత్రంబు త్వంపదలక్ష్యా
ర్థంబు - సమష్టిశరీరావస్థాత్రయాత్మకయైన మాయయును- వైశ్వానర
హిరణ్యగర్భావ్యాకృతనామకంబులైన - మాయాప్రతిబింబేశ్వరచైత
న్యంబులును - సర్వజ్ఞత్వ- సర్వేశ్వరత్వ - సర్వాంతర్యామిత్వాది గుణం
బులునుంగూడి - తత్పదవాచ్యార్థంబు దేశకృత - కాలకృత - వస్తుకృ
త- పరిచ్ఛేదశూన్యంబును - స్వజాతీయ - విజాతీయ - స్వగతభేదరహితం
బును - సత్యజ్ఞానానందస్వరూపంబును - నయినపరిపూర్ణాద్వితీయబ్రహ్మ
చైతన్యమాత్రంబు - తత్పదలక్ష్యార్థంబగు - విరుద్ధధర్మకంబులయిన-
వాచ్యార్థంబులతో- లక్ష్యార్థంబులకయిక్యంబు సంభవింపదట్లుగావున
నొక్కదేశంబున - నొక్కకాలంబున - నొక్కరూపంబు నమన్నపురుషుని
వేఱొక్కదేశంబున - మఱియొక్కకాలంబునఁ గొండొకరూపంబు చేనుం
డంగఁ గాంచి - తద్దేశ - తత్కాల - తదవస్థావిశేషంబులను - నేతద్దే
శయుతత్కాలయుతదవస్థావిశేషంబులను గణించి - లక్షింపక లక్ష్యభూతుం
డయిన యతండితండని - యొక్కనింగా నెఱింగిన తెఱంగున - జహదజహ
ల్లక్షణచేత - మాయికంబులయి - మిథ్యాభూతంబులయిన - యుభయ
వాచ్యార్థంబుల - నిషేధించి- ద్వివిధలక్ష్యార్థచైతన్యంబుల- కైక్యం
బు దెలియుమిదియ - యసిపదార్థం బిదియె - జీవేశ్వరైక్యజ్ఞానం - బిది
యె మహావాక్యార్థం - బింక జీవబ్రహ్మైక్యంబుపదేశించెద - నాకర్ణింపు
మనిమఱియు నిట్లనియె॥ ... ... ... ... ...

—జీవబ్రహ్మైక్యోపదేశము.—

సీ ॥ గానరజ్జుస్థాణుమృగతృష్ణి కాశుక్తిశిలాది మధ్యమాంతముల
యందు । స్వస్వభావముల చేవసియించియన్నియువసుసతోనజ్ఞానవశమువల
న । నీలతాహిమనుష్యనీరరౌప్యంబులయి కనుపట్టి వివరించి కాంచు నెడలఁ ।
గల్పితరూపముల్లకు మిథ్యలయిపోవఁ దత్త్వంబులయిన చందమున నాత్మఁ ।
డయ్యువతమున నాద్యవిద్యాత్మశక్తి । వలనజీవుడయి తోఁచి కేవలనిజస్వ । రూ

పము నెఱుంగుచో బూర్వరూపముడిగి । యద్వయానందమూర్తి యైయలరు
ననఘా ॥ వ ॥ ఇవ్విధంబున రజ్జ్వజ్ఞానంబువలన రజ్జువునందు భుజంగం బారోపి
తంబయి యాప్తవాక్యంబుచేత దత్సర్పభ్రాంతివినాశంబగుచుండ రజ్జువు ర
జ్జువయగున తెలియంగున నఖండసచ్చిదానందస్వరూపుండాత్మజ్ఞానంబువలన దనకు
దానజీవుండయి తోచియనంతరంబున శ్రీగురువాక్యంబుచేత నీవు జీవుండవు
గావు పరిపూర్ణచయితన్యమాత్రుండవని చెప్పుడు బోధితుండగు నప్పుడా
లంకు దేహేంద్రియప్రాణమనోబుద్ధ్యాద్యహంకారాత్మభ్రాంతిరహితం
బుచుండ ప్రత్యగభిన్నాద్వితీయబ్రహ్మచయితన్యమాత్రుండగుచు నిజజీవబ్రహ్మై
క్యంబింక నోంకారస్వరూపంబెఱింగించెద వినుమని యిట్లనియె॥

—— ఓంకారస్వరూపనిర్ణయము ——

సీ॥ ఘనతరదేహజాగ్రద్విశ్వయిరాజసులకారమాత్రమో సుగుణఖర్వ ।
తనువిగ్రహస్వప్నతయిజససాత్త్వికులును కారార్థమో లలితచరిత ।
పృథులకారణసుషుప్తిప్రాజ్ఞసర్వేశ్వరుల్ మకారార్థమో చిరవర్ణ । సం
తతపరిపూర్ణ సచ్చిదానందాత్మతత్త్వమోంకారమో సత్యమూర్తి ।
యట్లుగావున వర్ణత్రయాత్మకంబు । నాత్మరూపకమయిన వాచ్యార్థమ
గును । గాన ప్రణవస్వరూపుడనేనటంచు । దెలిసి భావింపవలయు నిర్మలవిచార॥

వ ॥ ఇట్లు దేహత్రయావస్థాత్రయతాపత్రయసుఖత్రయకర్మత్రయ
కర్తృత్రయబుద్ధిత్రయ శ్రద్ధాత్రయధృతిత్రయగుణత్రయశక్తిత్రయకా
లత్రయలోకత్రయలోకత్రయ దేవత్రయమూర్తిత్రయవృత్తిత్రయస్థాన
త్రయజీవత్రయయైశ్వర్యత్రయ పరిశక్తిత్రయభక్తిత్రయదీక్షాత్రయనేత్రత్రయ
లక్ష్యత్రయజ్ఞానత్రయమండలత్రయముక్తిత్రయాత్మకంబయిన వర్ణత్రయం
బారోపితంబయిన వాచ్యార్థంబు గావున నేతత్స్వర్ణంబును క్రమంబున న
కారంబు - ను కారంబునను ను కారంబు మ కారంబునను మకారంబు నోం
కారంబునందును బ్రవిలాపంబు నొందించి యంతట దత్ప్రవిలాపంబును వి
శ్వాధిష్ఠానంబును బరిపూర్ణంబును దురీయంబును నక్షరంబును లక్ష్యా
ర్థంబునునయిన శుద్ధోంకారమాత్రంబు గాన వలోకించిన నంతరంబున తత్స్వ
రూపమాత్రుండవయి ప్రకాశింపుము ॥ మ ॥ అనిబోధించిన నాంజనేయు
డపుడాత్మారాముని గాంచియో । యనఘా యేవరయుక్తిచే నొకట వాచ్యా
ర్థంబు బ్రోచియం । తనెలక్ష్యార్థము చూడఁగావలయు నందంబొప్ప
నాయుక్తిహో । చ్చిననామిన్నినుపింపు భక్తవరదా శ్రీరామసీతాపతీ॥

నము సకార్యములం దొగిన్ । మానకం జరియించు నెందభిమానపూర్వకవృత్తు లన్॥ వ॥ అట్లుగావున॥ గీ॥ ఎఱుకమఱపుల నెఱిఁగెడియెఱుకనేను। విధినిషేధములనుగాంచు విభుఁడనేను। తర్క్యములనెల్లఁ దర్కించుతత్వమేను। నేను నేనని వివరించు నేతనేను॥ క॥ నేననినన్ను మూర్ఖుఁడు । మేనని వీక్షించుఁ గాన మేల్కని సత్య। జ్ఞానానందమయునిఁగా । జ్ఞానముచే నెఱుఁగ వలయు సద్గుణశాలీ॥ క॥ నేననిన(ఁ)దనువునకు నభి। మానమునకు నర్థము సుఁ బ్రమాదము వలనం । గాననవి రెండునర్థములౌ నేనన నేన కేవలాత్ముఁడనఘా॥ క॥ నానా నూఁను నినను న। న్నేనే ననిన్ను నన్ను నేననననిన। న్నేనను నేన వాన్నవా । నేను నన న్నెన్నిన మ్నని ను నేననవా॥ క॥ మేను మనము మానము మును । నేనను మనసమ్ము మాని నే మమ్ము నన। న్నె నేననినమ్మినని । మానమనూనాను మాన మైనను నెమ్మిన్॥ క॥ మన మేపనిఁ జేసిననది। మన మే చేసితిమటంచు మదిదోఁచు సఖా। తన మైద్యోతన మైచే। తన మైతగునునను(ఁగ)ల్పితంబది యనఘా॥ ఉ॥ నమ్ము మనమ్ములోననుది నమ్ము వెలుంగు నదాత్మరూపవ। ర్ణమ్ము నిజమ్ము నేనునిధనమ్మును సంతనమ్ము రూపవ। ర్ణమ్మును గర్త్రుకార్యకరణమ్ములు వర్ణగుణాశ్రమాభిమా। నమ్ములు నాకు లే వసుఘనమ్మగు నా వసనమ్ము నెమ్మదిన్॥ చ॥ అగు విజసింపనింప కును హోవిషయేచ్ఛ యుమానిమానిత। స్ఫురదభిమానమానసవచోఘన కాయని వాసనాసనం। బొరయక మేను నేన నెడిబుద్ధినిఁ దోఁచుట చేతఁ జేతనే। తఁడును గాను గానఁ బరత। త్త్వమె పిశ్నమభావభావనన్॥ చ॥ ఇరవుగ నెన్న నెన్నఁ దొకయుంచుక లేకయయున్నయున్నతిం । బొరలు వికారకారదిమబోధముదీసి తెఱంగెఱుంగ గా। నెఱిఁగి శమించి నించిపరమేశ్వరభావముఁ బొందఁ బొందిదా । మఱి నఘీరఘీ సుచిర మార్గదు మోంతు మఁ జేఁ జేయన్॥ ... ... ... *

వ॥ అని యుపదేశించి వెండియు నాత్మస్వరూపం బతిస్పష్టంబుగా నెఱుంగుకొఱకు నింక నొకపరమ రహస్యంబుఁ జెప్పెద సావధానచిత్తుండవై యాకర్ణింపుమని యిట్లనియె॥ సీ॥ కలితశబ్దశ్రోత్రఘనమనోహంకృతుల్లు ప్రశ్యములీవు సకదృక్కు నేను । స్పర్శత్వగింద్రియాంచన్మనోహంకృతుల్ల దృశ్యములీవు సకదృక్కు నేను । సలలితరూపలోచనమనోహంకృతుల్లు దృశ్యములీవు సకదృక్కు నేను । గమనీయరసరసజ్ఞామనోహంకృతుల్ల దృశ్యములీవు నికదృక్కు నేను । అతిసురభివాసి ఘ్రాణ మనోహంకృతులును దృశ్యములు గానవీనికి దృక్కు నేను । బహువిధాంతర్బహిస్థ ప్రపంచమెల్ల దృశ్యమల్గొటఁ బరిపూర్ణదృక్కు నేను॥ అదియెట్లంటేని॥ సీ॥ శబ్దాదివిషయపంచకము దృశ్యంబగు శ్రవణాదికరణపంచకమునకును

శ్రవణాదికరణపంచకముదృశ్యంబగుఁ దతనుమనోబుద్ధ్యహంకృతులకరయఁ|
దతనుమనోబుద్ధ్యహంకృతులు దృశ్యంబగుఁ బరిపూర్ణప్రజ్ఞయ బ్రహ్మమునకు|
బరిపూర్ణప్రజ్ఞయ బ్రహ్మంబన బనాకు దృశ్యత్వ మింతయుఁ జింతింపలేదు। గాన
నిరతిశయసుస్వప్రకాశనిత్యు| కారణనిర్విషయావ్యయాకాశకల్పు| కల్పనాతీతస
చ్చిత్సుఖస్వరూపు| సురుచిరాఖండశుద్ధవస్తువును నేను॥ వ॥ అట్టిదృక్స్వరూపునై
న నాకుదృశ్యత్వము గలుగఁ జెల్లనిసనకునుముదృక్కును - సంవిత్తును - చిత్తును -
జ్ఞప్తియు - జ్ఞానంబును - బోధంబును - చైతన్యంబును - ననునిట్టి ఘటపటసంభకల
శశబ్దంబుల భంగిఁబర్యాయనామంబులట్లగుట దృక్కనేననన్నవలోకించు
నది దృగన్యంబననదియభాస్యంబులై జడంబులైన ఘటాదులు భాసకంబయిన
దీపంబును బ్రకాశింపఁజేయ నేరనిపగిదినాచేతఁ బ్రకాశ్యంబులైయచేతనం
బులయిన యహంకారమనో నేత్రరూపాదికంబులు ప్రకాశకంబయిన సు
త్స్వరూపంబుం దెలియనోపవు - దృగంతరంబనిన నాదృగంతరంబు స్వ
ల్పప్రభారూపంబయిన ప్రదీపంబనల్ప తేజోవంతుండగు భానుమంతుని వె
లుంగింపలేని చందంబునని కృష్టంబైయెఱుంగ సమర్థంబుగాదు సమానంబై
తేజరిల్లంజేయుననిన రత్నంబునకు స్వసదృశరత్నాంతరంబును భాసిల్లంజే
యకుమంటు లేని పోలికనుత్తమంబై విలసిల్లంజేయ శక్యంబుగాదియునుం
గాక వేదాంతంబులయందుఁ జైతన్యద్వయంబను కంబదియట్లుండ నిమ్ముస
ముత్కృష్టంబై కాంచుననిననదియు మతియొకదృగంతరంబునకు దృశ్యం
బుగావలయునకైన దానిఁగనుంగొను దృగంతరాంతరంబింకనొక్కటియని
నని తెలియుననిన సంఖ్యాతదృగంతరాంగీకారంబు తోఁచునందువలన నవస్థా
దోషంబు ప్రాప్తంబగునట్లుగాక కొన్నిదృగంతరంబుల నూహించి యొక్క-
టినిలిపి యిటమీఁదదీనికి ద్రష్టలేఁడనిన నన్నంటికింగలుఁగ నితని కెట్లులేకుండు
గలడనిన వానికివ్యభిచారంబు వచ్చునివ్విధంబుగాక మొదటిదృగంతరంబు
నిరతిశయంబనిన నెయ్యదిసర్వకారణంబయి నిష్కారణంబయి తనకంటె ని
తరంబయిన సర్వంబును సాధనంబులేక తానవీక్షించునదియె నేనుగావునస్వ
యంప్రకాశ పరిపూర్ణప్రజ్ఞయబ్రహ్మంబునగుదునని యుపదేశించిమతియు
నిట్లనియె॥ గీ॥ తెలియఁబడుచున్నవిశ్వంబుదృశ్యమనసి। తెలివినై సర్వమును
గాంచుదృక్కనేను| మిగులనాకంటెనన్య మేమియును లేదు। సత్యమిదిసర్వ
వేదాంతసంగ్రహంబు॥ క॥ జీవత్రితయతనుత్రిత| యావస్థాత్రితయములకన
తిరిక్తుఁడఁద| ద్భావాభావజ్ఞుఁడనగు| కేవలచిన్మయుఁడనేనుగసాక్షిశా॥సీ॥భూ

తపంచకముసుబుద్ధ్యహంకారంబుల వ్యక్తమునునింద్రియములుపదియు। నె
క్కటివిషయపంచకమును జేతనేచ్ఛాద్వేషసుఖదుఃఖసంఘధృతులు। క్షరము
క్షేత్రంబనఁగఁ దనొప్పునిదియ పరాప్రకృతి యనఁగ బ్రకృతియనఁగ। నలరు నీప్ర
కృతితోఁగలసివర్తించుచుండా భానుఁడక్షరాంశుఁడనఁదగు। పరఁగు క్షేత్రజ్ఞుఁడన
బరాప్రకృతి నాఁగ। బురుషుఁడనఁగ నీరెంటికిఁబ్రాంతు గలుఁగ। నొనరఁగను
గొను నేఁబురుషోత్తముఁడనఁ। బరుఁడనఁగ వెల్గుచుండుదుఁ బవనతనయ॥ ... *

—*క్షరాక్షరవిచారము.*—

కం॥ నేనమ చునక్షరుండ। జ్ఞానము చేక్షరము నెఱుఁగు చందంబునవి। జ్ఞాన
ము చేనప్పురుషుని। నేనసవీక్షింతు వేఱు నిజముగ లేమిన్॥ గీ॥ పరుఁడనను నాకున
క్షరపురుషునకును। భేదమేమియు లేదుకన్పట్టిచూడఁ। గలదె వేఱెంచు కైనలో
కమునముఖ్య। బింబమునకును బ్రతిబింబమునకు॥ గీ॥ ఘటము పోలిసినఁ దద్ఘ
టాకాశమౌక। సమునఁ జెందినకరణిఁ విజ్ఞానదృష్టి। క్షరము నెడఁబాసి నక్షరాక్ష
రుఁడు నన్నుఁ। బొందికన్నుఁ బొరయుఁడు పూర్వసంజ్ఞ॥ ... ... *

వ॥ ఇట్లుపృథివ్యప్తేజోవాయ్వాకాశంబులును - మనోబుద్ధ్యహంకా
రంబులును - వీనికిఁగారణంబగున యవ్యక్తంబును - శ్రోత్రత్వక్చక్షుర్జిహ్వా
ఘ్రాణవాక్పాణిపాదపాయూపస్థలను - దశేంద్రియంబులును - శబ్దస్ప
ర్శరూపరసగంధంబులను - పంచవిషయంబులనుఁగూడి యిరువదినాలుగు త
త్త్వంబులకుఁ గొండఱు వాగాది కర్మేంద్రియపంచకంబును - శ్రోత్రాది
జ్ఞానేంద్రియపంచకంబును - శబ్దాదివిషయపంచకంబును - ప్రాణాదివాయు
పంచకంబును - మానసాద్యంతఃకరణ చతుష్టయంబునుఁగూడి యిరువది నా
లుగు తత్త్వంబులని చెప్పదురు చతుర్వింశతి తత్త్వంబులను శరీరత్రయం
బనియును పంచకోశంబులనియును - బండితులు గణింతురిది మదీయా పరా
ప్రకృతియిది క్షేత్రంబును - క్షరంబును - బ్రకృతియు - నవాత్మయు - దృశ్యంబు
ను - నసత్తును - జడంబును - దుఃఖాత్మకంబును - సంసారంబును - ననఁనొప్పుఁ - ద
ప్తాయః పిండంబుతోఁగూడి ప్రకాశించు కృశానుచందంబున మిథ్యాతాదా
త్మ్యధ్యానంబుచేత దీనితో నెనసి ప్రవర్తించుమదంశ భూతుండైనజీవుండు పం
చవింశకుండు తండస్మదీయపరాప్రకృతి క్షేత్రజ్ఞుండును - నక్షరుండును - బు
రుషుండును - నాత్ముండును - ద్రష్టయు - సద్రూపకుండును - జేతనుండును -
సానందమయుండును - సంసారియు - ననం జెలంగుచుండు - నదియెట్లనినం బూ
ర్వోక్తతత్త్వంబులలోఁ బ్రధానావయవంబును - సర్వకార్యకారణాశ్రయం

బును- సకలవాసనామయంబును- ననాద్యనిర్వచనీయాజ్ఞానకల్పితంబును నై
నబుద్ధ్యహంకారాత్మకాంతఃకరణవృత్తివిశేషంబునందు జలఘటంబునందా
దిత్య ప్రతిబింబంబును దర్పణంబునందు ముఖాభాసంబునుం దోచిన విధంబు
న నస్మచ్ఛాయ ప్రతిఫలించె. తదుపాధికుండై కరణభోజ్యజ్ఞానప్రమాణశబ్దవా
చ్యంబైన స్థూలగోళకోపహిత జ్ఞానకర్మేంద్రియ ప్రాణపంచక సమష్టి
తమనశ్చిత్తాత్మకాంతఃకరణవృత్తివిశేషసాధనంబు చేతం గ్రాహ్య భోగజ్ఞే
య ప్రమేయ శబ్దవాచ్యంబులైన శబ్దాది విషయంబుల ననుభవించుచుం
గర్తయు భోక్తయు - జ్ఞాతయు - ప్రమాతయు - శ్రోతయు - స్ప్రష్టయు
ద్రష్టయు రసయితయు - ఘ్రాతయు - వక్తయు - దాతయు గంతయు - విస
ర్జయితయు - నానందయితయుం - బ్రాణియు మంతయు - దేహియు జీ
వుండు ననం బ్రసిద్ధుండయి సమధిక శరీరజాగ్రదవస్థాభిమానియై విశ్వుండన-
సూక్ష్మదేహస్వప్నావస్థాభిమానియై తైజసుండనం - గారణాంగసుషుప్త్య
వస్థాభిమానియై ప్రాజ్ఞుండన - విలసిల్లి నిఖిల వాసనాసమేతుండయి యయ్య
స్మదంతసాన్నిధ్యంబు వలన నయస్సు చలించెడు తెఱంగున సూర్యాలోకం
బునాశ్రయించి స్వస్వవ్యాపారంబులం బ్రవర్తించు జనంబు భంగి సర్వా
ధిష్ఠానభూతుండును - ప్రధానపురుషేశ్వరుండును - బురాణపురుషోత్తమా
ఖ్యుండును - దనకు ముఖ్యబింబభూతుండును - షడ్వింశకుండును - బరుం
డును - బరమాత్ముండును నైన నాసన్నిధానంబువలన నస్మదీయ తేజంబాసం
శ్రయించియున్న యట్టి కర్తన్న వామయాపాత్మకుని గాదలంచి సంసృతిచ
క్రంబునం బరిభ్రమించుచుండు - నిట్లనాద్యనంత కాలంబు ప్రవర్తించుచుం
డియెట్టకేలకు ననేకజన్మార్జిత పుణ్యపుంజ పరిపాక విశేషంబువలనను మద
నుగ్రహంబువలననుం బరిశుద్ధహృదయుండును - సాధనచతుష్టయసంపద్వి
శిష్టుండునునయి సద్గురు చరణకమలంబు నొంది తత్ప్రసాదలబ్ధాత్మానాత్మవి
వేకజ్ఞానసహితుండయి యుడుగుదు గాయాద్యహంకృత్యంతంబయిన క్షరం
బంతయుం దాను గానని నిరాకరించి కలశ జలనాశానంతరంబున నుపసూర్య
కంబు మహాతాండునిం జెందినకయి వడి ముకురవియోగంబగుచుండ వదనా
భాసంబు ప్రధానాననంబునం గలసినరీతి మఠఘటకుడ్య కుసూల స్తంభ పటాద్యు
పలక్షిత ద్రవ్యంబుల వేఱ్వేఱ విభజించిన శేషవస్తునిషేధావధీభూతం
బును నమూర్తంబునునగు తదవచ్ఛిన్నాకాశంబు మహాకాశంబయిన పగి
దిదను త్రయవిలక్షణుండును - నవస్థాత్రయసాక్షియుః - బంచ కోశవ్య

తిరిక్తుండనునయియఖండా ద్వితీయసచ్చిదానంద స్వరూప పరిపూర్ణపర బ్రహ్మతత్వమాత్రుండను నట్టిక్షరాక్షరాతీత పురుషోత్తమతత్వంబేనని చెప్పి మఱియునిట్లనియె ॥ గీ ॥ పంచవిషయములను బంచేంద్రియములచేఁ । గాంచు తేఁటివి నేను కపివరేణ్య । పంచకోశములను బంచభూతంబుల । నెంచిచూచునట్టియెఱుక నేను ॥ లయవిభాతి ॥ తెలిసెనిది నాకిప్పుడు తెలియదది లెస్సగను దెలియ వివరింపుదును దెలిసెదనటంచుం । బలికితి నిబలుకనింకఁ బలికెదనటంచుం చుమనిఁదలఁపకుదలంచితిని దలఁచెదనటంచున్ । వెలుపలను లోపలను దెలియుఁ బహువృత్తులను దెలియుచు వెలుంగులను వెలుఁగులకుచుండం । గలయు వెలిఁగించుతొలివెలుఁగును నేనునను దెలియుము వివేకదశగలమనముచేతన్॥

మ ॥ నతదేవా వెలిలోఁ బదార్థములనానాచ్ఛిద్రభాండోదర । స్థితదీపం బెటిఁగించుచందమునహృద్ధీప్రాణదేహేంద్రియా । న్వితదేహస్థుడనైన నేననిశమున్నిర్హేతుకాజ్ఞానక । ల్పితబాహ్యాంతరనామరూపతతులన్ లీలన్వెలింగింపుదున్॥ ఉ॥ తమ్ము నెఱుంగలేవు విహితమ్ముగ దేహము ప్రాణపజ్రీచి । త్తమ్ముదశేంద్రియమ్ములు చితమ్ముగనన్యముగాన లేమిన । త్యమ్ముగ సో కపీంద్రసతతమ్ము నివానిఁగదియు కార్యజాతమ్మును నేనుగాంతునవ్యతమ్ముగనన్నుబలుతమ్ము గాఁదగన్ ॥ శా ॥ ధీచేతోవిషయాత్మకంబులకు జ్ఞాతృజ్ఞానవిజ్ఞేయముల్ । సూదించుం దగఁదల్లరోదయములన్ సుప్తిప్రబోధంబులే । నాచిత్రంబులవానిఁ జేయు నిజమాయన్ సాక్షినయిచూచుచున్ । రోదిష్ణుత్వము చేవసింతు సదసద్వ్యాపారిత్రికంబుగాన్ ॥ క ॥ మత్సాన్నిధ్యమువలననజిఁత్సాహంకారపవనచిత్తేంద్రియముల్ । వత్సా చలించుసుమిరం । గత్సదయసాకంతేసూదికలచందమునన్ ॥ క ॥ తపాయఃపిండాంతే । త్వ్యాపానలమండలంబువఁవునమాయా । గుప్తబ్రహ్మండనము । ద్దీప్తచిదాత్ముఁడనేను ధీరవరేణ్యా ॥ సీ ॥ ధరణీజలానలమరుదంబరాంతతా విష్టాఖిలాధారదృష్టి నేను । ఆదిత్యచంద్రగ్రహార్క్షతారా తటిత్సంవ్యాప్తదివ్యతేజంబు నేను । అమరమానవతిర్యగాదిచేతనధీ ప్రకాశమానజ్ఞానఘనుఁడ నేను । బ్రహ్మాదిదేవతా ప్రార్థనీయానంతకల్యాణగుణవిగ్రహుఁడనేను । కార్యరూపంబులయిన జగంబులకును । స్వేదుపాదానకారణంబును నిమిత్త । కారణమునయిననిర్మలాకారసత్వ । పరమమాయాసమన్వితేశ్వరుఁడ నేను॥

గీ ॥ వేదశాస్త్రాగమములచే వేదితవ్య । మైనవస్తువు నేను మహాత్ములకను । జపతపోదానయజ్ఞసంచయముచేత । వరసమారాధనీయదైవమును నేను॥

గీ॥ అనఘసాకారుఁడనుఁగాను వినుసమష్టి । ఘనతనువ్యయతాదాత్మ్య
మునకుఁ జొరమి । సరిని రాకారుఁడనుగాను సాక్షినగుచుఁ । గారణశరీర మే
నను కలక లేమి ॥గీ॥ అఖిలభూతములందు నేనఖిలభూత । ములును నాయందు
కలుగంగఁ బొరయ నెంచుఁ । గాన నదియునన్నంటవు నానరేంద్ర । సమత
నొప్పగు గగనంబుచందమునను ॥క॥ మృగతృష్ణికల నెఱింగినఁ । దగజలము
లభావము ను విధమునఁ దెలివిచే । నగుణుఁడగు నన్నుఁ దెలిసిన । జగములు నా
యందు లేవు సత్యంబనఘా ॥ చ॥ అనృతమచేతనంబసుఖమయిన జగంబు
ఋతంబు చేతనం । బును సుఖమయి విమూఢులకు భోగముగాఁగనుపట్టు లె
ల్లన । నైనయుట చేతఁ జుమ్మి దికపేంద్రఘృతాన్విత దుగ్ధపూరముల్ । ఘన
మధురంబులయి వెలయుకయి వడిభక్ష జవానురంజనా ॥క॥ జ్ఞానులకఖండ
సత్య । జ్ఞానానందస్వరూపసాక్షినగుచు విజ్ఞానముచేఁ దెలియంబడి । నే నై
సాక్షాత్కరింతు నిక్కంబనఘా ॥గీ॥ అట్లుగావుననన ఘమహాత్ము లెల్ల । సచ్చి
దానందమయునిఁగా సర్వకర్తృఁ । కరణకార్యములకు సాక్షిఁగాఁగనన్ను ।
దెలిసియనవరతంబు చింతింపవలయు ॥ క ॥ అనవినిహానుమంతుఁడు రా । ము
నిదివ్యపదారవిందములకున్ ఘనవం । దనమాచరించి పలికె । స్వినయముభ
క్తియు నదృఢవివేకము మెఱయన్ ॥ ఉ॥ ఏనియమంబులుం గలిగి యేసమయం
బున నెవ్విధంబునన్ । మానముపూని యేయదియు మానియొ నుంత్రముతంత్ర
మెద్దియో । నీనయరూపమారయఁగ నిక్కపు మోసగుణంబొ నెమ్మదిన్ । ధ్యా
నము సేయఁగావలయు నన్నియు బ్రేమనెఱుంగఁ జెప్పవే॥

క ॥ అనినఁ జెలునప్పునప్పుచు । మునమున దేహాత బుద్ధి మల్లఁశిగొన । నిట్లు
నియెను నాహానుమంతునకుఁ గమ్మఁగొసగాముం జపలికెఁ గౌతుకమలరన్॥

ఉ ॥ వానరనాథ దేహమును వాయువులింద్రియపఙ్క్తి చిత్తము । జ్ఞాన
సబుద్ధులేవనుచు మానముపూనిన మాన వాలికిన్ । మానము దేశకాలనియ
మంబులుమంత్రముతంత్రముస్విధుల్ । వానిని జూచు సాక్షినను వానికిఁ గల్గు
నెతద్వికారముల్ ॥ శా॥ ఆత్మానాత్మలు రెండు వస్తువులు లక్ష్యంబుల్ గ
దాయందనా । త్మాత్మభ్రాంతి ఘువాదినుండి సహజంబయి యుండఁగానిప్పు
డీ । వాత్మజ్ఞ ప్తివటంచు జెప్పితిఁ కనన్యంబేమియున్ లేదు శు । ద్ధాత్మప్రత్య
గభిన్నపూర్ణపరమాత్మారాముని ందక్కగన్ ॥క॥ అసమానసమగ్రతురి । య
నమాధిని బొందుమింద్రియమనోబుద్ధి । శ్వసనగ్రసవాభ్యసన । వ్యసనము
డిగిసమరసాత్ముఁడవగుచున్ ॥క॥ మాయామయ జాయాసుత । కాయేంద్రియ

మానసాదికపరిత్యాగో । హ్యయజ్ఞేయామేయ । ధ్యేయాత్ముఁడవీవు వగవ వి
థే యాత వరా * సీ॥ ఏదేశమున నైన నే కాలమున నైన నేమి సేయుచు నైన
నెట్టులున్న । నఖిలవికారంబులావిద్యకంబులు నేనవికారుండ నిష్ప్రపంచ । నిర్వి
కల్పాఖండనిశ్చలనిర్మలావ్యయ సచ్చిదానందమయుండనిహ । పరిపూర్ణ ని
ర్గుణ ప్రత్యగాత్మాభిన్నపరమాత్ముఁడనటంచుఁ బరమనిష్ఠ । సంతతంబును ద
నుఁగాంచు సజ్జనునకు । మంత్రతంత్రంబు లేల కర్మంబు లేల । జపతపోవ్రత
దానయజ్ఞంబు లేల । నామవర్ణాశ్రమాభిమానంబు లేల ॥గీ॥ వాయుసుతస
ర్వవాసనావాసితంబు । సూక్ష్మదేహంబు జడముగుసుమ్ము దాని । నంటక
వెలుంగుచుండు చిదాత్ముఁడచ్చి । దాత్ముఁడౌ వానివికృతు లెట్లంటు ననఘ॥

సీ॥ ఘటగతవ్యోమవికారముల్ తత్ప్రకాశకసూర్యనంటని చందమునను । దేహేంద్రియప్రాణధీమనోహంకారతద్ధర్మతతుల తద్భాసకుండు । సా
క్షియై యొప్పు సచ్చిదానందమయాత్మునిం బొరయవయ్యాత్ముఁడగుట । వె
లుఁగు పండితున కెవ్విధమునఁ గల్గు వర్ణాశ్రమాచారాదులు రసికుండ । గర్త
గాఁడు గానఁ గరణకార్యములును । భోక్తగాఁడు గాన భోజ్యభోగ । ములు
ను లేవు సర్వముఁ గల్గవతనికి । సర్వరూపుఁడగుట సాధువర్య॥

క॥ జ్ఞానియనఁగ వేఱొక్కఁడె । నేను సుమీ తెలియవాతనికి నాకును । జ్ఞా
నము చేఁబరికించినఁ । గానఁబడదు భేదమెంచఁగ వినుతచరిత్రా ॥ క॥ జ్ఞానికి నేను
బరోక్షుఁడఁ । గాను బరోక్షుండు నాకుఁ గాఁడతఁ డిలను । జ్ఞానంబజ్ఞానులకిది ।
గానఁబడదు తారునన్నుఁ గానమి ననఘా ॥ క॥ త్రిగుణాత్మికయగు ప్రకృతిం । తగి
లినచో సగుణుఁడం బ్రకృతి దాని విడుచుచో । నగుణుఁడ నియ్యుభయము నన్నతి । సుగుణు
లునీ రెండుఁ గాను సుమ్మవిలేమి॥ ... ... ... ... ... *

వ॥ అట్లుగావున ॥ అయ్యగ్రహీ ॥ భృంగములయందును బతంగములయం
దును విహంగములయందును కురంగములయందుఁ । సింగములయందును
మతంగజములందును దురంగములయందును భుజంగములయందే । కాం
గలరు దేవమునిపుంగవనరాది ఘనజంగమములందును నజంగమములందు ।
స్సంగమును భంగమును గలుఁగ కొకభంగిని నెలుంగుచు నేనని కనుంగొనుము
వత్సా ॥ గీ॥ తనువు తానను దృష్టి నైశ్వర్యకర్త । కనిశము గుణత్రయమ్ముతో నె
నసియున్న । యమ్మనమె యమ్ము దాని కాయమ్ము లతిర । యమ్ములై తోఁచు సతివి
షయమ్ములనఘ ॥ క॥ మానసమఖిలంబునకుఁ । బ్రధానంబు ప్రధానమే ప్రధానము
మదికిన్ । దాని విడిచి ననుగనుమది । తానవముం బొందియంతఁ దానవసిచెడుఁ ॥

గీ॥ ప్రకృతివికృతి వాని ప్రకృతియొకటింగిరయా। సుకృతినన్నుఁగనుము ప్ర
కృతమునను। వాత్మ నెఱుఁగునప్పుడా ప్రకృతియేయప। కృతియొనర్చుచుం
డు నెవుడుఁగడఁగి ॥క॥ ఖంబునుమీను నివిషయను। ఖంబునుమీ త్రిజగదభిము
ఖంబునుమీను। ఖంబునుమీయదితగ్నము। ఖంబునుమీనిరతిశయసుఖం
బుకపీంద్రా॥ క॥ వినువినువీధి తెలంగన। ఘనఘనమయి భువుసర్వగతమై
తగు చేఁ। దనుఁదనుఁదను తనువుగఁగని। మను మను జుని బ్రతుకు బ్రతుకుమా
రుతతనయా ॥క॥ సారాసారవిచారవి। శారదుఁడవు సుకృతి వికృతిజనికృ
తితతికిఁ। శారదనీరదవారవి। దూరవిను త్రైలముభంగిదొలగి వెలుంగుఁ॥
క॥ పరమయినునీశ్వరయయినుఖ। కరమగుతనుమానసాదికరణావళిస
త్పరమా పరమా దరమా। స్థిరమోదాకరపదాత్మధీరతిగఁగుఁగఁ॥
క॥ తరమా పరమానందే। తరమాజగమనుచుఁజూడదగమాధునకా।
చరమార్థము దెలియుటకు। పరమాగురుకరుణవడయు నర్జునకుఁ॥
వ॥ అనియివ్విధంబునను యుపదేశించి హనుమంతునితో శ్రీరామచం
ద్రుండు మఱియును * సీ॥ అస్తోకసద్గురూపాస్తిచేనతతపిత్వ స్తకాముండు
నిరస్తమోహుఁ। దస్తంగతాశుండపాస్తలోభుండు సన్యస్తరోషుండు వి
ప్రస్తమదుఁడు। గ్రస్తనిస్త్రైంద్రియ స్తోముఁడ శ్రాంతవిస్తారితపథిప్రశ
స్తుఁడగుచు। స్వస్తినసు స్తకన్య స్తనిజాచార్యహ స్తాబ్జవిదితదివ్య స్తుతత్వ।
డమితశ్రమదమముఖగుణసముదయయుత। సుముఖ సనుర సవిమలహృత్క
మలుఁడతఁ। విషమవిషసమకలుషవిషయవిముఖుఁ డయిన మేధావి తత్త్వ
బోధాహర్షుఁడనఘ ॥ఉ॥ మానును మిథ్యగాదెలియుమాయనుఁదత్కృతమో
ల్లకల్లసు। మాయను మేను నేననుమాయను సౌఖ్యవినీవుమానుకొ। మాయ
నుఁజూడఁగానితరమాయను నేననినిశ్చయించుకొ। మాయనుఁ గాకపోనిత
రమాయను మానమునాను మాయనుఁ॥ వ॥ అని వెండియు నిట్లనియెనిదియా
రూఢునిప్రకారంబింక నారురుక్షుని మార్గంబు వివరించెద॥ .. *
సీ॥ మేధావి యొకలఁ డాసాధు రత్నా స్త్రాదిసాధనాసాదితబోధుఁ డై
న। దాక్షిణ్య నియములరోధించి మనములో శోధించి కామసు క్రోధముఖవి।
రోధియూథంబుల వేధించి బాధించి బాధయోగ్యాళులోపాధులను ని। షేధిం
చి సర్వనిషేధావధీభూతసాధిభూతాధిదైవాధియజ్ఞ। బోధమయునిరుపాధి
కాగాధలసద। బోధకానందవిమలపాథోధియగుచు। వ్యాధులనుపాధుల
జయించునట్టి ఘనసమాధి సుఖలోలుఁడగువాఁడె సాధకుండు॥

ఖగంబులుం దురంగపన్నగంబులున్ వనంబులున్ । మృగంబులు న్నగంబులున్
మహీధరాదికంబులున్ । జగంబులున్ లయంబునొందు సాక్షినై సమస్తముం
దగంగఁ జూచుచుండుదున్ సదా సదాత్మకుండనై॥ ..... ..... *

సీ॥ దేహేంద్రియప్రాణధీమనోహంకారగతి త్రయము లిమ్మతమ చేష్టలుడిగి।
యలఘుసుషుప్తియం దజ్ఞానమున లయ మొందిన వేళ నే నుంటఁ జేసి । యేమియు
లేదని యెఱుంగుదు వా సుఖభావమంతయు ను స్వభావము గను । గావున విను
తన భావానుభవము సంస్మరియించు మేలొన్న సమయమునను । వరుసతోని
ట్టులు జాగరస్వప్నసుప్తు । లనుదినంబే బదేంచుచు నగుచుండ । నేకతఁ బ్రొద్దుఁ
డను ఋవాని నెప్పు డగనుచునికి వలన నుసద్రూపుఁడను గపీంద్ర ॥ గీ॥ జాగరం
బునందు స్వప్నసుషుప్తులు । స్వప్నమునను సుషుప్తి జాగరములు। సరిసుషుప్తి
యందు స్వప్నజాగరములు । గలుగ నేను పీనఁగాంతు నెప్పుడు॥

సీ॥ భువి నవస్థాత్రయంబున నేకరూపత నొకదివసంబునందున్నయట్లు। విను
మతీతాగామి దినవారపక్షమాసాబ్దయుగ ప్రకల్పాంతములను । నొక్కచం
దంబునయుండు చుండఁగాఁ గాన సద్రూపుఁడను వినిశ్చయమునుమ్ము । యదిగాక బా
ధయోగ్యములగు నదేహేంద్రియ ప్రాణధీమనోహంకృతులును । నేను
గానని భావింపనిఖిలదృశ్య । చయనిషేధావధీభూతసర్వబాధ । వర్జితాశే
షసాక్షినయి వలయుచుంటి । వలరసత్యస్వరూపుఁడన లఘుచరిత॥

వ॥ మఱియు లఘ్వక్షరోచ్చారణమాత్ర కాలంబు నిమేషం బట్టి నిమేషం
బులు పదునేనిమిది యైన కాష్ఠ యవియు ముప్పదియైన కళ యవియన్ని యయి
నక్షణంబు లిపండ్రెండు ముహూర్తంబు ముహూర్తంబులు ముప్పదియగు
నన హోరాత్రంబు గడచు నయ్యహోరాత్రంబున శరీరేంద్రియప్రాణాం
తఃకరణంబులు స్వస్వవ్యాపారంబులు చాలించి తమోగుణంబయిన సుషు
ప్తిరూపావిద్యాంధకారంబునందు లయంబు నొందుచున్నవాడు జాగ్రత్స్వ
ప్నాత్మకంబగు నఖిలప్రపంచంబు వాసనారూపమాత్రంబయి పల్లవపత్రపు
ష్పశలాటుఫలమూలశాఖోపశాఖాత్మకంబగు వటవృక్షంబు వటబీజంబు
నందును నానావిధవర్ణమయుక్తంబయిన మయూరంబు తదీయాండాంతర్జ
లంబునందు నున్నచందంబున నుండు నిది నిత్యప్రళయంబన నొప్పు - నయ్య
హోరాత్రపంచదశకంబు పక్షంబయ్యె శుక్లకృష్ణాఖ్యపక్షద్వయంబు మాసం
బది పితృదేవతలకొక్కదినంబగు - నమ్మాసద్వయంబు ఋతువు ఋతుత్ర
యంబయనంబు దక్షిణోత్తరసంజ్ఞికాయనద్వయంబు సంవత్సరంబది దేవతల

కొక్క దినంబగు నద్దివస వాసరపక్షమాసక్రమంబుచేత ద్వాదశసహస్రవత్స
రంబులయిన కృతత్రేతాద్వాపరకలియుగంబులు నాలుగుం జతుర్యుగచ
తుష్టయంబును మహాయుగంబని చెప్పఁబడు నవి డెబ్బదియొకటి యయిన మన్వం
తరంబు చెల్లు నమ్మన్వంతరంబులు పదునాల్గు చనిన నది నలువకు నొక్క పగలగు
నది చతుర్యుగసహస్రపరిమితంబగు నట్టిలోఁ జతుర్దశమను ప్రళయంబులును
ననేక యుగాంతప్రళయంబులును బ్రవర్తించునవియును నైమిత్తికప్రళయం
బుల వాంతరప్రళయంబులనం బ్రసిద్ధంబులగు నందుచేత శతాబ్దంబులు చనిన
జతుర్ముఖుండు నాకంబుఁ జెందు నయ్యెడ వృశ్యప్రసమస్తజీవుల నొక్క
పెట్టం బరిమార్పఁగ రుద్రుండు చిచ్చుకన్ను తెఱచి చూచు నాదిత్యుండు చంద్రుం
డును మాత్రులు గైకొని ప్రకాశించు నవ్వేళ ప్రజ్వలజ్వాలాకీలంబగు మహాన
లంబు జనియించి విశ్వంబు సంతయు భస్మీభూతంబుగాఁ జేయు సప్తమారు
తంబులు నొక్కపెట్ట విసరు నవ ప్రేఘంబులుప్పతిల్లి యమోఘంబులయి నా
లుగు దివ్యవర్షంబులు మహావర్షంబు కురియు నందువలన సమస్తసముద్రం
బులుం గలసి యేకార్ణవంబయి మహామహీమండలంబు నాక్రమించు నంత
ధరణీచక్రంబు మహాసలిల మధ్యంబున బహుళకంబుల స్వల్ప లోష్టపిం
డంబు విధంబున విరిసి చెడుఁ దప్పాయః పిండంబొకట తోయకణంబునుం బీల్చి
నకయువడి బడబాగ్ని విజృంభించి యమ్మహాంభోరాశినిఁ బానంబు సేయు దీ
పంబును గాలి యార్చినభంగి నమ్మహాతేజోమండలంబును మహావాయు
వు దెగటార్చు నమ్మహాజంఝామారుతంబు నిరాధేయంబగుటం జేసి యంతరి
క్షంబునం గలయం దిరిగియందు సుషుప్తియందుఁ బ్రాణంబుల పోలిక వ్యక్తశ
బ్దరూపంబయిన సింగిని శ్రోత్రరూపంబయిన సంకల్పంబు మ్రింగిన తెఱంగున
నయ్యాకాశంబును మహామనంబు గ్రసించుఁ బంచతన్మాత్రసహితంబయి
న యమ్మహామానసంబును నిద్రాసమయంబు గబళించు చాడ్పున నహం
కారంబు గబళించు నయ్యహంకృతి మహాబుద్ధి మెసంగు నమ్మహాబుద్ధి యెమ
హాతత్త్వంబని చెప్పి మెప్పు నమ్మహాతత్త్వంబును నవ్యక్తంబు తనయందు
విలీనంబుగావించి యడంచుకొను సవిశేషావిద్యావ్యక్తతమస్సుషుప్తిప్ర
కృత్యానందాదిశబ్దవాచ్యంబయిన బ్రధానంబదియె బ్రహ్మప్రళయంబగు నయ్య
వాద్యనిర్వచనీయాజ్ఞానంబు సద్గురూ కటాక్షేశ్వరైక్యజ్ఞానానుభవసమయం
బున నభావంబగు నదియె మహాప్రళయంబగు నిట్టి నిత్యనైమిత్తికదైనందినక
ల్పాంత మహాప్రళయంబులయందే నొకటిచేత బాధింపఁబడక సాక్షినయి

వాటినన్నింటిని జూచుచుభూతభవిష్యద్వర్తమానకాలంబులయందే క
రూపంబుగానుండుటంజేసి సద్రూపుఁడనగుదునని యుపదేశించి వెండియు
నిట్లనియె. సీ॥ ఇదిఘటంబిదిపటంబిది స్తంభమిదికుడ్యం బిదియశ్వముశయ్యల
మిదియటంచు । నదిభూమియిదిజలంబిదితేజంబిది శ్వాసంబిడిగగనంబియాకసం
బిదియటంచు । నితండుదివాకరుండితండు నిశాకరుండివి తారలు గ్రహంబులి
వియటంచు । నివియచేతనములౌనివిచేతనములంచు నితండాతండతండితండే
నటంచు । నరయనాకంటెభిన్నంబులయిజడంబు । లయిన బాహ్యపదార్థ
సంహతులనెల్ల । సాధనములేకయెఱిఁగెడిసాక్షినగుట । నేనుచిద్రూపకుం
డనునమ్మువానరేంద్ర * సీ॥ ఇదిశరీరం బిదియింద్రియనికరంబులివి పంచవిష
యంబులివియప్రాణ । మిదిమనంబిదిచిత్తమిది యహంకారంబునిదిబుద్ధియు
నిదివిద్యయిదియవిద్య । యిదికామమిదిక్రోధమిదిలోభమిది మోహమిదిమహా
మత్సరమిదిమదంబు । నిదిజాగ్రత్స్వప్నమిది సుషుప్తితురీయ మిదియిదియ
నుచు నామెదుఁగవోఁదు । నాంతరపదార్థముల నెల్లననవరతము । సాధ
నంబేమియునులేకసాక్షినగుచు । నేనెఱుంగుచుఁగావుననిత్యవిమల । చిత్స్వ
రూపుఁడనగుదురాజితవిచార ॥ శా॥ వరసంప్రాప్తములయినదుఃఖములంబో
వంజూచుచుభూరిసు । స్థిరసౌఖ్యోన్నతిఁ జెందియుండుటను నేఁ జింతింపు
దుంగాననే । బరమప్రేమరసాస్పదుండనగుచు భావింపనెల్లోటచేఁ । బర
మానందమయాత్ముఁడఁజుమిజగత్ప్రకాశాత్మ జానిత్యముగ ॥ గీ॥ వివిధదుః
ఖాత్మకములయినవిషయతతులు । తోఁడరియత్యంతసుఖములయితోఁచునెల్ల ।
నతులితానందమయుఁడనయినట్టినాకు । సలలితాభాసమాత్రంబువలనఁజూవె ॥

గీ॥ దుఃఖమాగంతుకంబయితోఁచుచుండు । సుఖముస్వాభావికమువా
నరునివర్య । యట్లుగావుననిరతిశయాప్రమేయ । నిత్యపరమానందమయుఁడ
నునేనుపుత్ర ॥ వ॥ ఇట్లు కాలత్రయాబాధ్యత్వంబువలనను స్వారోపితాశేష
పదార్థభాసకత్వంబువలనను బరమప్రేమరసాస్పదత్వంబువలనను సచ్చిదా
నందస్వరూపుఁడనయిన నేనుమణికనకరజతతామ్రలోహకాంస్యమృణ్మ
యఘటంబులలోపల వెలుపలనంటక నాకాశంబువ్యాపించినచందంబున వి
యత్పవనతేజోజలభూదేవమానవతిర్యక్స్థావరాదిచరాచరంబులయందు
బాహ్యాభ్యంతరంబుల ననంగుండనయి నిండియుండుటంజేసి వాడదేశకృ
తపరిచ్ఛేదంబు లేమననాద్యనిర్వాచనీయమాయాకల్పిత భూతవర్తమా
నభవిష్యత్సమయంబులయందేకరూపత్వంబు చేతసాక్షినయి యుండియు

వానినెల్ల నెల్లప్పుడు దృశ్యంబుగా నెఱుంగుట వలనఁ గాలకృతపరిచ్ఛేదం బుగల్గుము మఱియును వృక్షంబునకు వృక్షాంతరంబు సజాతీయంబగు శిలాదికంబు విజాతీయంబయి పత్రపుష్పఫలాదికంబులు స్వగతంబులయి యొప్పినక్రియ వడినీయ యాత్మప్రపంచంబ సద్రూపంబగుటవలన నిరవయవంబును వ్యాపకంబును సంగంబును నగు గగనంబునకు నభావ రూపంబగు స్వభావంబగుటవలనను శశవిషాణంబెట్లుయుండగాని పగిది సజాతీయ విజాతీయ స్వగతంబులు గానేరవట్లగుటవ సుకృతపరిచ్ఛేదంబు శూన్యంబగు నివ్విధంబున త్రివిధ పరిచ్ఛేదరహితత్వంబువలన నద్వితీయ పరిపూర్ణ ప్రత్యగభిన్న పరబ్రహ్మ చైతన్యంబునగుదునని వెంచియుండ్లనిదొ॥ ... ..... ... *

గీ॥ ఘనఖండసచ్చిదానందమయుఁడనగు । నుల్లు వెలుఁగుచునికి నెఱిఁగి నన్ను । నేనటంచుఁ దెలియుచిప్పుడు సమత్స్వరూ । పాత్ములగుచుము క్తలగుదురనఘ ॥సీ॥ అనియిట్లు బోధించి యానందమూర్తియై శ్రీరాఘవుఁడు నిజ శ్రీపదార । విందంబులకు భక్తివందనంబులు సేయు హనుమంతుఁగని గొనియప్పుడతని । శిరమును పూర్వాద్రిశిఖరంబున యున్న కరారక్త మండలముదాయం గఁజేర్చి । తనకును నీకును సమ సకల యోగములుండెడి తెలివి నొసఁగెను నా తెలివి నీవు । తెలివి నీవని తెలుపగా తెలియు నెద్ది । యదియే నీవని వేలుగు చేనఁ గలుగుచు సిద్ధిగ త్వా వాద్యవిద్యాంధతిమిరమెల్ల । బాపి కేవలతత్త్వరూపంబుఁజూపె ॥ ఆసమయంబున ॥

చ॥ అటుఁబోదఁగాంచె మారుతి హృదంబుజమాంతర బింబిత స్ఫుర । ద్వటులపునఃపునశ్చలనసద్విషయస్వప్రకాశ దిగ్యాన్వితో । త్రుటపటుధీప్రవృత్తిసహితజ్ఞకళాంగని వేళ ముద్రశం । కటనిజభాప్రకాశితజగద్వ్రజ కోశము స్వప్రకాశము ॥ గీ॥ అట్టి తన్నుఁగాంచి యానందమూర్తియై । చిత్తరూపమట్లు చేష్టలుడిగి । తనువుమరచి కొంత దడవు పూరకుండె వా । యాంజనేయుఁ డోహిమాద్రితనయ ॥ గీ॥ త్రిపుటమాత్రంబవిద్యావిలిప్తమాత్ర । మైనఘను నెన్న లేకు బ్రహ్మతులనఁగ । తృణము సర్వజగద్విలక్షణముఁ బొందు । వాని నుతియింప నరమె యెవ్వరికైనను ॥గీ॥ అట్టి విజ్ఞానయోగసమాధినొంది । యనుపమానందమూర్తియై యాంజనేయు । డిట్టికేలను మేల్కని యెమరఁ జన్న । రామచంద్రునిజూచి సంభ్రమముతోడ ॥ క॥ మోదతన్మయుడగుచు యోగ । రాఘుండై భక్తిఁ బోసలను గ్రక్కున నపుడా । ప్పొంగిన మతిఁ జూచి రాముఁడు । గాఢాలింగనము చేసి గారవమలరన్॥ ... .... ... ...

వ॥ ఇట్లు గారవంబు జేసిన నయ్యాంజనేయుండు పరమేశ్వరున కనేకవిధ ప్రార్థనమస్కారస్తోత్రంబులు గావించెననిన విని పార్వతీదేవి యటమీఁద శ్రీరామస్వామి యేమి యుపదేశించెనని శ్రీమహాదేవున కిట్లనియెను॥

చ॥ కలుషవిదూర నిర్గతవికార సురాంబుజసూర సూర్యహృజ్జలజవిహార సుఖసాగర విశ్వశరీర భూరినిర్మలగుణవార వారినిధిసమానగభీర సుమేరుధీర । సన్మునిజనాభివందితమనఃకలితాత్మవిచారకారణా॥

క॥ సర్వేశ్వర సర్వోత్తమ । సర్వవ్యాపారసాక్షి సర్వాధారా । సర్వజ్ఞ సర్వతోముఖ । సర్వాధిష్ఠానభూత సర్వాకారా॥ ..... ... *

మాలిని॥ ప్రణమితమునిజాలా భాసురానంతలీలా । ప్రణతనిఖిలదేవా భవ్యదివ్యప్రభావా । ప్రణవజపనిధానా బ్రహ్మవిద్యానిధానా । గుణనిధి జగదీశా కోటిసూర్యప్రకాశా॥ ... ... ... ... :

గద్య॥ ఇది శ్రీమన్నారాయణమహాదేవ గురుకరుణాకటాక్షవీక్షణావిమలీకృతనిజహృదయ కమలకర్ణికాంతస్స్పందశీతాఖండసచ్చిదానందరసైకస్ఫూర్తిపాత్రక సీతారామమూర్తి పరశురామ పతులింగమూర్తి గురుమూర్తి ప్రణీతంబైన శ్రీసీతారామాంజనేయ సంవాదంబను యోగశాస్త్రంబునందు సాంఖ్యయోగానుభవవిచారంబనునది.

ద్వితీయాశ్వాసము.

*శ్రీరామచంద్రపరబ్రహ్మణేనమః.*



సీతారామాంజనేయసంవాదము.

తృతీయాశ్వాసము.



క॥ శ్రీయోగీశ్వరదత్తా । త్రేయపదాంబుజవిధేయధీరనికాయా । ధ్యేయా ఘనసచ్చిత్సుఖ । కాయ మహాదేవదేశిక ప్రభురాయా॥ ... *

వ॥ అవధరింపుము శ్రీమహాదేవుండమ్మహాదేవికిట్లనియె నట్లాంజనేయుండు పరమసాంఖ్య రాజయోగ సమాధివలన మేల్కని బ్రహ్మానందభరితాంతఃకరణుండయి తనముందరనున్న శ్రీసీతారామ గురునింగనుంగొని యనేక సాష్టాంగ దండప్రణామంబు లాచరించి నిటలతట ఘటితాంజలిపుటుండయి యిట్లని వినుతించె॥ .... .... ... .... .. *

దండకము.

శ్రీరామ రామా త్రిలోకాభిరామా పరంధామ నిష్కామ సంపూర్ణకామాంబుధేంద్రాంతరంగాబ్ధి సోమా లసద్దివ్యనామా విరాజద్గుణస్తోమ యుష్మత్ప్రకాశ స్వరూపంబ వాచ్యంబ చింత్యంబనంతంబనంగంబ ఖండంబబాధ్యంబసాధ్యంబ భేద్యంబ విచ్ఛేద్యమాద్యంత శూన్యంబజంబప్రమేయంబవిజ్ఞేయమధ్యేయ మద్వంద్వమవ్యక్తమగ్రాహ్యమధ్యాత్మమేకంబ రూపంబనాశ్యంబరక్తంబ శుక్లంబ కృష్ణంబ పీతంబ పీనంబసూక్ష్మంబదీర్ఘంబ హ్రస్వంబబాహ్యంబ జంతుగంబవ్యయంబింద్రియాగోచరంబ ప్రతర్క్యంబనిర్దేశ్యమాద్యంబదృశ్యంబ కంపంబలక్ష్యంబలిప్తంబశబ్దంబ నస్పర్శభూతంబరూపంబును స్వాదుగంధంబ వాఙ్మానస ప్రాప్యమయి పూర్ణమయి నిత్యమయిసత్యమయి సిద్ధమయి బుద్ధమయి ముక్తమయిశాంతమయి కేవలంబయి నిరాకారమయిసచ్చిదానందరూపాత్మ చైతన్యమై సర్వభూతోరు దేహేంద్రియ ప్రాణబుద్ధ్యహంకార దిక్కాలదృశ్యప్రపంచంబు నాజత్వ్యాది విశ్వమెల్లన్ విలింగింపఁగాఁ జేయు రీతిం బ్రకాశింపఁగాఁ జేయఁగా సాక్షివై యేకసంబేకమయి సర్వభాండంబులందంతటన్ లోపల న్వెల్పలన్నిండియున్నట్టులాకాశవాయ్వగ్ని వాభూమి నానావిధాశేష భూతంబులందంతటన్నిర్వికారుండవై యుండి కర్తృత్వభోక్తృత్వమంతృత్వభర్తృత్వ హాతృత్వముల్ నామరూపక్రియోపాధివర్ణాశ్రమంబుల్గుణంబుల్ వివేకావివేకంబులున్లోక మోహంబులున్లేక నీస్థూలసూక్ష్మంబులన్ జాగరస్వప్నసుప్త్యాదులుం బంచ భూతంబులుం బంచ కోశంబులుం జూచుచున్నిర్వికారుండవై నిర్వికల్పుండవై నిష్కళబ్రహ్మమాత్రుండవై యొప్పు నీదివ్యతత్త్వంబు నీసంభృతాంచత్కటాక్షంబు చేతం గనుంగొంటి దేవా నమస్తే నమస్తే నమస్తే నమః॥ ..... .... ..... ... *

అనిమతియు నిట్లనియె.

ఇంద్రవజ్రము ॥ విశ్వాంతరావాసకవిశ్వమూర్తీ। విశ్వప్రకాశోజ్జ్వలదర్ప విశ్వవంద్యా। విశ్వాత్మవిశ్వాతిగవిశ్వసాక్షీ। విశ్వాదివిశ్వేశ్వరవిశ్వరూపా॥ ఉపేంద్రవజ్రము ॥ నిరీశనిష్కామగుణానిర్వికల్పా। నిరీహనిర్వాణదనిర్వికారా। నిరామయానిర్గుణనిర్విశేషా। నిరంతరానందవినిశ్చితాత్మా॥ పృథ్వీవృత్తము ॥ చరాచరాకృతప్రపంచమయసర్వసంసారభృ। త్త్రిరంకురవిలక్షణాగత వికారదిల్లక్షణా। పరాపరసనాతనాపరమపావనోద్యో

తవా । పురాణపురుషోత్తమా పురుషపూర్ణావిద్యోత్తమా। భుజంగప్రయాత
ము॥ పరంధామదివ్యప్రభావాభిరామా । పరాకాశసంపూర్ణభవ్యప్రకా
శా । పరానందదేహాధిపా విశ్వతుందా । పరానందసచ్చిత్స్వభావాత్మ
రూపా ॥క॥ మాయాప్రతిబింబేశ్వర। మాయామయదివ్యదేహ మాయాతీ
తా।మాయావిమాయరూపా।మాయారహితాత్మతత్త్వమయజయరామా॥

క॥ భూతకరభూతభావన । భూతభరణభూతహరణభూతావాసా ।
భూతేశ్వరభూతాశ్రయ । భూతాత్మకభూతసాక్షి భూతాత్మహారీ॥

స్రగ్విణీవృత్తము॥ యోగయోగాంగసంయుక్తయోగప్రియా । యో
గముద్రాన్వితాయోగనిద్రాంకితా । యోగలభ్యోవనా యోగసిద్ధిప్ర
దా । యోగమాయాశ్రయయోగయోగీశ్వరా॥ వసంతతిలకము॥ వేదాగ
మావిషయ విగ్రహవేదవేద్యా । వేదాంగవేదనుతవేదవివేకశీలా । వేదా
దివేదమయవేదగివేదజిహ్వ । వేదాంతతత్త్వసువివేచనవేదితవ్యా॥

క॥ శాస్త్రాగమపరికల్పక । శాస్త్రాచార్యోపదేశసారార్థజ్ఞా । శా
స్త్రాగమార్థతత్పర । శాస్త్రార్థవిచారగమ్యశాస్త్రప్రవరా॥

క॥ విద్యానిధివిద్యాపద । విద్యావిద్యాతిరిక్తవిద్యావేద్యా । విద్యా
పతివిద్యామయ । విద్యానందాసితాత్మవిద్యాసారా॥ ... ... *

మాలిని॥ యజ్ఞవిధాయకయజ్ఞనియామకయజ్ఞఫలాశ్రయయజ్ఞకరా ।
యజ్ఞఫలావనయజ్ఞఫలాశనయజ్ఞఫలప్రదయజ్ఞధరా । యజ్ఞవిధిప్రియయజ్ఞస
మర్థతయజ్ఞసుసాధనయజ్ఞపతీ । యజ్ఞశరీరకయజ్ఞరహస్యగయజ్ఞపరాయణ
యజ్ఞమయా ॥ క ॥ మంత్రప్రభావదర్శక । మంత్రప్రియసకలమంత్రమం
త్రార్థజ్ఞా । మంత్రార్థగమ్యమంత్రీ । మంత్రాధిష్ఠానదేవమయ
మంత్రాత్మా ॥ క॥ జపకల్పకజపతల్పక । జపకోట్యారాధనీయజపతత్త్వ
జ్ఞా । జపజప్యజాపకాత్మక । జపయజ్ఞఫలస్వరూపజపలభ్యాత్మా॥

క॥ ధ్యానప్రియసంతతహృ । ధ్యానధ్యేయాత్మరూపతత్త్వధ్యాతృ ।
ధ్యానధ్యేయాధ్యాతృ । ధ్యానపరాయణసమస్తతత్త్వాతీతా॥ ... *

క॥ పూజావిధానదర్శకపూజాతద్వస్తుపూజ్యపూజకరూపా । పూ
జాఫలప్రదాయక । పూజాప్రియపూజనీయపూజావిషయా॥

క॥ నామప్రియనారాయణ । నామకవిశ్వాద్యనంతనామార్థజ్ఞా।నా
మప్రభావదర్శక । నామాదివికారరహితనతవిబుధహితా। ..

క॥ గురుశిష్యభావకల్పక । గురుశిష్యాచారధర్మగుణపరిపాలా । గు

దుశిష్యరూపధారీ । గురుశిష్యైక్యావబోధగుణగురుమూర్తీ॥ ...

విద్యున్మాలావృత్తము॥ ధర్మాధారా ధ్యాధర్మాధ్యక్షో ధర్మీధర్మాత్మాధర్మజ్ఞా । ధర్మా ధారాధర్మా కారా । ధర్మాధర్మాత్యంతాభావా॥ సుకాంతివృత్తము॥ ధనాజనాధనప్రియా ధనాధిపాధనంజయా॥

ఉపజాతివృత్తము ॥ కామాదికామాదివికారశూన్య । సమస్తకామప్రపత్త్యకామా । కామ్యమ్ము కామప్రియకామకామీ । కుమారమాకామకకామరూప ॥ విభూతివృత్తము ॥ మోక్షలక్షణేక్షణా । మోక్షధర్మరక్షణా । మోక్షసౌఖ్యదాయకా । మోక్షరాజ్యనాయకా॥ ... .....

క॥ లక్ష్మీకరలక్ష్మీధర॥ లక్ష్మీముఖకమలచంద్రలక్ష్మీనాథా। లక్ష్మీనివాసవిద్యా । లక్ష్మీప్రదసత్కటాక్షలవలక్ష్మీశా ॥ మందాక్రాంతవృత్తము ॥ సర్వాధారాసకలవిగుణాసర్వభూతాధివాసా । సర్వాధ్యక్షాసకలవరదాసర్వవాగీశ్వరేశా । సర్వవ్యాపీనదయహృదయా సర్వసర్వాంతరాత్మా । సర్వాతీతాసమరసమయా సచ్చిదానందరూపా వ ॥ అని వెండియునిట్లనియె॥ సీసదశకము ॥ ప్రకటపరాపరప్రకృతిమంతుండవు మఱియు వశీకృతమాయుండవును । సర్వజ్ఞుండవు సర్వశక్తియుక్తుండవు సర్వకర్తవు సర్వజనకుడవును । సర్వరక్షకుండవు సర్వసంహర్తవు సర్వేశ్వరుండవు సర్వగుడవు| సర్వగురుండవు సర్వతోముఖుండవు సర్వసాక్షివి సర్వసముండవగుచు। నిర్వికల్పనిరంజననిర్వికార । నిర్గుణబ్రహ్మమయి యొప్పునిను భజింతు । సంతతంబాత్మమయతసాక్షాత్కరింపు । రామరాఘవ శ్రీరామ రామ రామ॥౧॥ విశ్వంబునం దేను వెలుఁగుచునుందు దువిశ్వంబు నాయందు వెలయుననుచు । నరసియద్వైతయువ్యతిరేకముగఁ జూచుయుక్తి యే భవదీయయోగమాయ । యీయోగదృష్టిచే నెప్పుడు నిను నీవ కనుఁగొంచు సంతతాఖండసత్త్వ । దానందమయుండవై యలరారు నీయునికిఁ గాంచి భవత్కటాక్షంబుచేత । నైననిఁక నొక్క వరమిప్పుడడుగవలసె । నిమనీస్థితి నాస్థితిగాఁ భజించు । సలలితాభేదదృష్టి నొసంగుమయ్య । రామరాఘవ శ్రీరామరామరామ ॥౨॥ నారాయణియును వైష్ణవియును దేవియుఁ ద్రిగుణాత్మికయుఁ బ్రకృతియుననంగ। నలరుభవచ్ఛక్తి యాపరాప్రకృతి పరాప్రకృతి నాద్వివిధమయి పరఁగునందు। తతచతుర్వింశతితత్త్వరూపిణియైన యపరయే దైవియు నాసురియును । నన రెండు దెఱఁగులనమరు నాదైవియవిద్యయు మాయయనా విమలగాన । నాసురియవిద్యయనా రెంటిసంటిమఱియు । నీశజీవాత్మసంజ్ఞల నెనఁగునంత। గలిగియ

వికారుండవు వీఁగాంచుకతన । రామరాఘవ శ్రీరామరామరామ ॥౩॥ అ
పరాప్రకృత్యవిద్యాక్షురత్నే త్రిపదాదిశబ్దైకవాచ్యాత్మశక్తి సన్నిధానజపగస్ఫ
రితసచ్ఛాయాప్రసక్తిచేమిథ్యాభియుక్తిచేత । నీపరాప్రకృతివిద్యాక్షురత్నే
త్రజ్ఞసత్త్వగుణపాదికంజ్ఞనొప్పు । నేనహర్షిష్ట ప్రనైనిర్వికారాసంగసాక్షినై వి
లసిల్లుచందమెఱిఁగి । రమణ ద్రష్టృత్వసిద్ధి కారకత్వసాక్షి । తాఁగెవిద్యో
క్తధర్మజాతమునుదోఁటి । పగిదిఁగడ ద్రోఁచనీస్వరూపముభజింతు । రా
మరాఘవశ్రీరామరామరామ ॥౪॥ పరమవైరాగ్యంబుభాసురాత్మజ్ఞానమ
తులితైశ్వర్యమనంతవీర్య । మమితయశంబు సమగ్రలక్ష్మియుఁగలిసంపూర్ణ
కారుణ్యశమదమములు । మహనీయతేజంబు మహితతపస్సత్యశౌచధైర్య
క్షమార్జవగుణంబు । లొప్పారనిజగద్వ్యాపారముగ మాయామహాశక్తి సర్వ
ప్రపంచంబురీర్ప । సచ్చిదానందలక్షణఅగుణనిర్గు । ణాత్మకబ్రహ్మమయిన
నీవాత్మమయత । సంతతమతిస్ఫుటముగసాక్షాత్కరింపు । రామరాఘవ
శ్రీరామరామరామ ॥౫॥ ఘుంఘుటాకాశమహాకాశాంశముచు వాకాశంబు
నకువేఱుగానిపగిది । తనగుణతోఁగూడి యుక్తుండనయి విలసిల్లునే మనీయం
శంబుసత్త్వయంబు । నయిననావ్యశక్తిగుణరాశినాయందు నారోపణముఁగఁ
జేసి । జీవుడనంచుసంసృతిఁజెందియుండితినిందాఁకనవియుపు డెఱిఁగికొంటి ।
గానవివరింపభేదమింతైనఁగలుగ । నిట్టివిజ్ఞానసంపన్నెల్లప్రోవ । చిత్తము
నఁదు ప్రకాశింపఁజేయుమయ్య । రామరాఘవశ్రీరామరామరామ ॥౬॥
నీకంటెనన్యంబునే నెన్నఁడెఱుఁగ నెట్లనిననాయనుభవమువధరింపు । విపిధేం
ద్రియములకువిషయమీవిశ్వమావిశ్వగూపుఁడ వీవువేఱుకనేల । గావుననీవు
సాక్షాత్కరించితివిదివిశ్వంబునీకను వేఱటంచు । దలఁచునజ్ఞానమంతయుఁబో
యెనీదయా మయదృష్టి నానందమయుఁడనయితి । సంశయములేదు గాన
యీసర్వరూప । సమరసజ్ఞానభావనసంతతంబు । గలుగపరము ప్రసాదింప
వలయుదేవ । రామరాఘవశ్రీరామరామరామ ॥౭॥ తతచతుర్వింశతితత్త్వ
నాయకుఁడవుపంచవింశకుఁడవుప్రకృతికంటెఁ । బరుఁడవుగురుఁడవుపరమేశ్వ
రుండవుపురుషోత్తముఁడవు నెప్పుడుఁబ్రధాన । పురుషేశ్వరుండవుపూర్ణుం
డవనుచునెన్నఁబెఱిఁగితిగాని యీయెఱుకదృఢము । గాసిల్వ నజ్ఞానకార్యదే
హాదికాత్మధ్యానసంతతాభ్యాసవశతనట్లుగావునఁ గేవలాత్మాత్మయోగదృ
ష్టిమనమున నే ప్రొద్దుఁ దేజరిల్ల । భూరికృపచేననుగ్రహింపుముపోసంగ । రా
మరాఘవశ్రీరామరామరామ ॥౮॥ అజుఁడవవ్యయుఁడవీవాదినారాయణ స్వా

ముని సౌఖ్యవిసర్వమయుఁడ । తెరయొప్పనిన్ను మాయామానుషశరీరధారిఁ జూ
గించి ద్రుంధునఁ గడటించు । నజ్ఞానవశత మోహంబుచేఁ దలఁచితి నింద్రాకనది
తుమియించుకొంటిని సర్వజ్ఞసర్వేశసర్వభూతావాససర్వభూతాత్మకసర్వ
మూర్తీ । సర్వకర్మఫలాధ్యక్షసర్వరూప । యని నుతింపుచు మ్రొక్కె
దననవరతము । నెరయ నామము నీయందు నిల్పఁజేయు । రామ రాఘవ శ్రీరా
మ రామ రామ ॥ గీ॥ తతచతుర్వింశతితత్త్వాత్మకంబగుచు రమునేఁగానునిక్క
ముగ నరయఁ । దత్కృతంబులు మత్కృతంబులుగాఁ బుకారిన సర్వధర్మ
ములను ద్యజించి । యతురపురుషుండనయితు రాతుచతత్త్వములమీఁది పురు
షోత్తముండు నాతుఁ । డననొప్పునొకని నిన్నాశ్రయించెద శరణముగ నేనని
యనన్యత్వమలర । నట్లగుటనింక నే సంశయములనప్పుఁ । బొరయకుండంగ
జేసి యీ పూర్ణబోధ । మతిస్పృశంబుగ వరమిమ్ము సతతమాత్మ । రామ రా
ఘవ శ్రీ రామ రామ రామ ॥ ... ... ... ... ... *

వ॥ అని యిట్లఖండపాండిత్యంబుచేతఁ బెక్కుభంగుల వినుతించు హనుమం
తుని సాదరంబుగాఁ గరుణా కటాక్ష వీక్షణంబుచేతఁ గనుఁగొని భూరి ప్రేమ
ధాముండును బరంధాముండును నైన యాత్మారాముండిట్లనియె॥ ...

గీ॥ సంతసము నీవు జెప్పిన శ్రుతి గొంటివి । సతతమాత్మ సమాధిఁ గో
రితివి గాన । గడఁగి యమనస్కరాజయోగంబు నీకుఁ । దెలియఁజెప్పెద వి
నుము సందేహ ముడిగి ॥ చ॥ అలయక సప్తవారిధుల నావలి కొక్క తీర్థిగాఁ గల
యుఁగనీఁదవచ్చు నగంబులు నచ్చనగఁ ద్లుగాఁగరఁ । బులఁగొని యాడవచ్చు
నభముల్ గబళింపఁగవచ్చుఁ గానియి । య్యలన మనస్కయోగ ముగ్రహిం
పఁగ రాదు తలంప నేరికిన్ । భూతిలకవృత్తము॥ కావున నయ్యమనస్కయోగము
గాథ దుర్లభమారయన్ । కేవలతత్త్వవిచారముం బరికింపనేరని వారికిన్ ।
భావమునందు నవాత్మ నాత్మ నిబాగుగా విభజించు మే । ధావికి నిత్యసుఖంబు
గా విశదంబుగా సులభంబగున్ ॥ తోటకవృత్తము ॥ చెలువుగఁ బువ్వులు చీకు
టకంటెన్ । బొలువుగఁ గన్గవ మూయుటకంటెన్ । నలువకు నీయమనస్క
పథంబున్ । సులభము సౌఖ్యము సూక్ష్మవత్సా ॥ తోటకవృత్తము ॥ అమృతం
బు సుఖంబుగ నాసనయు । ట్లమనస్కముఁ బూనియహర్నిశమున్ । సమతం బ
నుఁ గన్గొను సజ్జనున । య్యమృతాంగన చేకొను నందముగాన్ ॥ ...

సీ॥ పాలుచాలను గ్రోలఁ జాలు నేతగనాలపాదుకలఁ బీనుకలు పొదలు
చున్న । లోపలి రసమాన నోపునే యులఁ గోతి వారికేళఫలంబుఁ జేరికన్న । సోం

పారరతులచేసుఖయింపవేశ్య నేమంతుండుమఱిరంభసరసనున్నఁ । దనమో
ముసోగసుఁగన్గొనునెవ్వఁడుండు మించుటద్దంబుచేసుంచుకొన్న । గలుగ
నేనిత్యనిర్మలాఖండసుఖము । నలఘుతారకసాంఖ్యయోగాశ్రితులకుఁ ।
దత్తమవితోఁ గధమలక్షితలపగిది । విలసదమనస్కయోగాప్తివలనఁగాక ॥

తరల ॥ స్ఫురితతారకసాంఖ్యములిన్నుపూర్వపక్షములుత్తమం । బగ
యగానమనస్కయోగమవాక్యముంగనుహృద్యముం । బరమగుహ్యమురా
జయోగముబ్రహ్మవిద్యసుహృత్తనో । హరముకేవలనిర్వికల్పసమాధిసు
మ్మిదిమాఱుతీ॥ క్రౌంచపదవృత్తము ॥ సారపదార్థంబారయుడుంబాసకల
నిగమములుచదివిననయినం । గూరినయాశాపాశములెల్లం గోడవనియిలువి
డిచిదిరిగిననయినం । గారవముం జేకూఱఁగని యోగజపరసముఖముగలుగదువ
త్సా॥ గీ॥ అట్లుగావునఁబరమరహస్యమయిన । విలసదమనస్కయోగంబువి
స్తరింతు । సీ॥ కెఱుంగఁజెప్పెద వినుమువివేకయుక్త । సూక్ష్మదృష్టినిగనుమతిసూ
క్ష్మముగను ॥ పంచచామరము॥ మనంబెస్థూలసూక్ష్మముల్ ప్రధానతృమానమే
యముల్ । మనంబెకామరోషలోభమత్సరాదివృత్తులు । మ్మనంబెసర్వధ
ర్మముల్ మనంబెబంధమోక్షముల్ । మనంబెదృశ్యమంతయుం గ్రమంబు
చేనెఱింగినన్ ॥ గీ॥ సర్వసంసారమునుమానసమునఁబొదవు । సర్వసంసార
మునుమానసమునఁనుండు । సర్వసంసారమునుమానసముననడఁగు। సర్వసం
సారమ్మునుమానసంబెయగును ॥ వ॥ అదియెట్లంటేని:॥చ॥ మనసుసుషుప్తియం
దెనసిద్ధమగ్గినచేమియుఁదోఁపకుండున । మ్మనముతుమేలుకొన్నసమస్తజగం
బులుగల్గితోచు నీ । ఘనతరబంధమోక్షమయకారణకార్యములెల్లడాఁగయై ।
యనిశముఁ లో వెలిందిగుగు నాఁగయనెమ్మనమట్లుగావునన్ ॥ ... ...

వ ॥ మఱియునమ్మనంబు కార్యకారణంబె సంకల్పంబుసంసారంబుసర్వ
వాసనామయంబు బంధమోక్షకంబునననేప్పుఁ గారణాకారంబయియవిద్య
యుఁబ్రకృతియునజ్ఞానంబును మాయయుననందనునట్టిమానసంబులేమి య
యమనస్కంబట్టికట్టఁజేసె॥ ... ..... ... ... ❀

సీ॥ ఆరోపితభుజంగముమరఁగన్నట్టునేస్పు రనధిష్ఠానరజ్జువుగసిన । నా
రోపితమనుష్యుఁడలరఁజూపట్టునేభువినధిష్ఠానకాంకువునుగసిన । నారోపితో
దకంబరయంగఁదోఁచునేకసదధిష్ఠానారకరముగసిన । నారోపితాచ్ఛాస్త్రా
ప్యములత్యుగునె యధిష్ఠానమయినశుక్తికనుగనినఁ । దలఁపనారోపితాసి
తత్త్వంబుమరలఁ । గాననగునెయధిష్ఠానఖంబుగసినఁ । దెలియనారోపిత

మనంబు దృశ్యము నై । తగ నధిష్ఠానపూర్ణతత్త్వము గనిన॥

వ॥ అదియెట్లనిన వినుము సాధన చతుష్టయసంపత్తిపూర్వకంబుగా బ్రహ్మజ్ఞానాధికారివై యున్న సమయంబున స్వాధిష్ఠాన చిదాభాసుండ వైన నీవు నావరణంబులయిన చతుర్వింశతితత్త్వాత్మకపంచకోశంబులను వేర్వేర విభజంచి నేతి నేతియను మహావాక్యంబు చెప్పిన విధంబున నేను గానని నిషేధించి కేవలసాక్షిస్థచైతన్యమాత్రుండనై తిరని తెలిసి యంతట నీ ప్రకారంబున దేవతిర్యఙ్మనుష్యాదిసర్వభూతంబులం బంచకోశంబులం బంచ మహాభూతంబుల నొక్కట పెట్టి నిరాకరించి యచ్చట బరబ్రహ్మచైతన్యంబుండ భావించియామీద దట్టద్వంపదార్థంపదాత్మపద ప్రజ్ఞాన పదలక్ష్యార్థభూత ప్రత్యగాత్ముండవన బున నేను సత్యద్బ్రహ్మ సకలలక్ష్యార్థ భూత పరమాత్ముడనియును దత్సత్యజ్ఞానానందస్వరూప పరమాత్ముండు సచ్చిదానంద లక్షణప్రత్యగాత్ముండ నము న నేననియును నిట్లనోన్యాఖండసమరసైక్యంబును భావించి నిరావరణాధిష్ఠానపరిపూర్ణ ద్వితీయశుద్ధచైతన్య ప్రకాశమాత్రుండవై ప్రకాశించు నీకు బ్రహ్మాండమాత్రాంశు నకంధకారంబుగను పట్టని తెలియగున సర్వకారణ కార్యాత్మకంబయిన మనంబుగలుగ మరజ్వారోపిత సర్పంబునుగని యది సర్పంబుగాక సత్సర్వంబు గావించి మఱియు దిరజ్జువని సిద్ధించియయ్యధిష్ఠానంబు నెఱింగినపిమ్మట గల్పితభుజంగంబ భావంబై రజ్జుమాత్రంబు శేషించు తెఱంగున శరీరత్రయంబును నాత్మగాదని కడద్రోచి యాత్మమాత్రుండవైన నీకు మనంబు లేదు మఱియును॥ ... ... ... *

క॥ లోకాభితస్వాధిష్ఠానచి । దాభాసుడవై ననీకునఖిలము దోచుగ ।
శోధింకేవలనిత్యని । రాభాసుడవై న దృశ్యమంతయు నడగున్॥

క॥ కమనీయుటగను దెఱచుట । ఘనసచ్చిత్సుఖమయాత్మగను గొనకున్నం । గనుమూసినగను దెఱచిన । గనబడు వెలిలోన మనోవికారమె వత్సా॥

ము॥ ఘనతందారకసాంఖ్యయోగముల చేగష్టింపగా నేలనె । మ్మనమంబట్లగ నేల నింద్రియముల మర్దింపగా నేలచ । కన్నగా ముండట గానుపించు ఘటముం బట్ల బ్రహ్మంబుగా । దనుదాగాంచినయంతలోని ఖిలముం డానై వెలుంగుందుదిగ॥ ... ... .... .. *

క॥ తనుదాగాననిమనుజుని । మనమునిరోధింపబడక మసలుచుదిరుగుగ । దనుదాగనుసత్పురుషుడు । ఘనమానందాబ్ధియందు మగ్నత నొందున్।

మ॥ వనితానందనచందనాదివిషయ వ్రాతంబులంబొందిచ । య్యానన

తంతఁ జొక్కు నెమ్మనము బ్రహ్మానందవారాశిని । ననయుక్తిం జొక్కపోక నేనియు వినాశంబొందునా నామ్రపు । పునటద్భృంగముఁ జంపకప్రసవసంస్పర్శాప్తిఁ గూలుం గతిన్ ॥ క॥ చక్కెరయును లవణంబును । గ్రక్కన నుదకములయందుఁ గఱఁగినరీతిన్ । మిక్కిలి తనుగను మనమది । చొక్కుచు వానందజలధిఁ బడి సిసశించున్ ॥ గీ॥ ఇతరసంకల్పములు లేక యెప్పుడును దాను । సచ్చిదాత్ముఁ డనని సుప్రసన్నవృత్తి । దన్నుఁ గనునాని చిత్తంబు దనకుఁ దాన । పొలియుఁ డనయందు సైంధవానలము వగిది॥ ... .. ... .... ...

క॥ ఇనుఁ డస్తమించు తఱి నా । తనికిరణములు తనితోఁ దఁగఁ జనుకీతిం । బెనుమానసంబు పొలిసిన । మునుకొని తద్ద్వికారములు పొలియుఁ గదన్॥

శా॥ నానాకర్మజవాసనాన్వితమనోనాశంబు గాకున్న బ్ర । హ్మానందానుభవంబు గల్గునె యవాయాసంబు గానిప్పుడే యాధ్యానందాంబుధి నోలలాడక నుబాహ్యాభ్యంతరాతార్థానుసం । ధానోద్భూత నితాంతదుఃఖమయసంతాపంబు చల్లాఱునే॥ .. .. ... ... .. *

వ॥ అని మఱియు నిట్లనియె పరమభాగవతోత్తమా నీవు దేహవ్యతిరిక్తుండవగుటం జేసి జన్మాస్తిత్వవృద్ధిపరిణామాపక్షయవినాశంబులును బాల్యకౌమారయౌవనజరావస్థలును వర్ణాశ్రమకులగోత్రనామరూపదేశకాలాదికంబులును స్థూలత్వకృశత్వదీర్ఘత్వహ్రస్వత్వనీలత్వరక్తత్వాదికంబులును నిరింద్రియుండవగుటం జేసి వచనాదానగమనవిసర్గానందకర్మంబులును శబ్దస్పర్శరూపరసగంధవిషయసంగంబులును నప్రాణుండవగుటం జేసి చలనధావనకంపనాకుంచనప్రసారణాదికంబులును క్షుత్పిపాసాదికంబులును నమనస్కుండవగుటం జేసి సంకల్పవికల్పంబులును రాగద్వేషకామక్రోధలోభమోహమదమాత్సర్యేర్ష్యాసూయాదంభదర్పాహంకారేచ్ఛాతృష్ణావిచికిత్సాశ్రద్ధాలజ్జాదయాభయశోకధైర్యాధైర్యదైన్యాదికంబులును నిత్యానిత్యవస్తువివేకవైరాగ్యశమదమోపరతితితిక్షాశ్రద్ధాసమాధానముముక్షుత్వశ్రవణమననిదిధ్యాసనజ్ఞానాదికంబులును ధీవిలక్షణుండవు నిరహంకారుండవగుటం జేసి కర్తృత్వభోక్తృత్వవిషయానందయుతత్వంబులును శ్రోతృత్వస్ప్రష్టృత్వరసయితృత్వఘ్రాతృత్వంబులును గంతృత్వజ్ఞాతృత్వమంతృత్వాహంతృత్వప్రమాతృత్వధ్యాతృత్వాదికంబులును నీకు లేవు కేవలశుద్ధచిద్రూపప్రత్యగభిన్నబ్రహ్మచైతన్యప్రకాశమాత్రుండవు గావున నేను శరీరేంద్రియప్రాణమనోబుద్ధ్యహంకారంబులు గాను స్వయం

ప్రకాశసచ్చిదానంద స్వరూపమాత్రుండననినిన్ను నీవువిలోకించు సమాధిస మయంబున సకలప్రకారసమన్వితమనోరహితుండవుగావే భూతభవిష్య ద్వర్తమానకాలంబుల నివ్విధంబునఁ బ్రకాశించుట వలననిరంతరంబును ని ర్వికల్పుండవై యేకరూపుండవై యుండుట కాద్యైయదిసర్వవికారశూన్య సహజామనస్క రాజయోగ సమాధిగాదేయని తెలిపినం దెలిసిహనుమం తుండు సీతాకాంతునకిట్లనియె॥ ... ... ... ... ...

క॥ ఇదియదియనాత్మనేగా । నదిబ్రహ్మము నేనటంచు నెఱుఁగనపుడు నె। మ్మదికలవోయిది । విదితంబుగఁదెలియఁజెప్పవే శ్రీరామా

వ॥ సమాధియందు మనంబుగలదంటేని.

సీ॥ మనసుగల్గినబుద్ధియునుదశేంద్రియములు ప్రాణాదులునుజతపడివ సించు । నవియునీస్థూలదేహంబును విడిచి యుండవు గాననదియునుండం గవలసె । మునకారణములేనికార్యంబులిలలేవుగావున దానినిల్కడయునె ప్పు । మూఁడుమేనులునంటి మొదలునుదుదలేని సంసారమంతయుచ్ఛముగ నుండు । నట్టులుండినచోసహజామనస్క । రాజయోగసమాధినిరంతరంబు। నెవ్విధంబునసిద్ధించు నెంచిచూడ । జానకీరామదేవతాసార్వభౌమ।

వ॥ అట్లగుటం జేసిమనంబులేదంటేని,

మ॥ తనరన్నెన్మదియంతయుంబొలియఁగాఁ దత్త్వాత్ముఁడైయుండి నం । బునరుత్థానముగల్గదాతనికినీ పొందొప్పినంధాత్రిపఁ। గనఁ ధాత్మా నుభవంబు గాంచియమనస్కంబెంచిబోధించున । జ్జనులాచార్యులఁగల్గరం చుమదిలోశంకింతు సీతాపతీ॥ ..... ... ... ...

క॥ బోధాచార్యులు లేరని । సాధించినరాజయోగసంతతికినిద । ద్బోధంబునకుఁదదీయస । మాధికిబాధకమువచ్చుమదికఁజలేమిఁగ॥

వ॥ ఇవ్విధంబుగాకజ్ఞాన విజ్ఞానసంపన్నులయిన మహానుభావులు స మాధియందుఁగొంతదడవుమనోరహితులయి యుండి కొండొక సేపునకు మేల్కని మెలంగుదురననఁ బరమపదంబునుం బొందినవారికిఁబునరావృత్తి ప్రాప్తించు నట్లయిన మోక్షంబునకనిత్యత్వంబువచ్చు నిట్లుబహువికల్ప సమన్వితంబయిన యీసంశయంబునిశ్శేషంబుగాని వర్తించు నట్లు పరమ రహస్యార్థం బుపదేశించి నిరతిశయకరుణాకటాక్షవీక్షణంబుచేత నను గ్రహింపవేయని ప్రార్థించిన నయ్యాంజనేయునికుశలతీవ్రసూక్ష్మ ప్రజ్ఞాదిశేషంబునకు మెచ్చిసచ్చిదానందస్వరూపాభిరాముండయిన యాత్మా

రాముండును పరమానంద భరితాంతఃకరణుండును వికసితముఖారవిందుండు నునయి సాదరంబుగా నిట్లనియె|| ... .. ... .....

క|| ఇదియిదియనాత్మయేగా । నిది బ్రహ్మము నేనటంచు నెఱుఁగు నెజడమై । కదలని మదియిటులా వుంది । గదిసి తెలియునతఁడె స్వప్రకాశాత్ముఁడగుఁ||

చ|| మనసు జడంబు దృశ్యమణుమాత్రము సన్నియతావితర్క్యముఁ । జననవినాశయుక్తమును సంశయరూపము దీనియునిక్కచే । తనుసుఖచిత్ప్రకాశమయతం దగ నీకుఁ గళంక మేమిచ । క్కనిశశశృంగవోషములు గల్గునె సూక్ష్మని కెన్నఁడేనియుఁ ||గీ|| శశవిషాణంబునకు వాకసంబునకును । గలుగు నెపొసంగ సంగంబు దలఁచిచూడ । మనమునకు సచ్చిదానందమయుఁడవైన । నీకుఁ బొందికయెన్నఁడేనియును గలదె ||గీ|| స్వప్రకాశుండవగు నిన్ను సన్మనోవి । కారములుఁ బొందునే పటికంపుఁగొండ । నెన్నఁడేనియుఁ గలలోనఁ గన్నయట్టి । సంజకెంజాయలంటునే యాంజనేయ|| ... ..... *

వ|| కపీంద్రా జలఘటపటాదియుక్తంబులయిన ఛిద్రత్వాచ్ఛాద్రత్వ శ్లక్ష్ణత్వాశ్లక్ష్ణత్వ స్పృష్టిమత్వాస్పృష్టిమత్వాదివికారంబులు విశ్వప్రకాశకుండయిన యాకాశమ్మునింబొరయునేరని తెఱంగున నహంకారధీమాన సేంద్రియ శరీరాదివిషగుణదోషంబులు స్వయంప్రకాశాత్మకుండవైన నిన్నుఁ బొందవు వాయుతేజోజల భూములును దత్కార్యంబులును దనయందుఁ గలిగియుఁ దాననిన్నిటియందు వ్యాపించియు నేమిటి నంటనిమింటి పగిదిఁ జిత్తాదిసర్వకారణ కార్యంబులు నిన్నాశ్రయించి నీయందు నిలిచియుండ సర్వవ్యాపకుండవయ్యు నసంగుండవైనని వేమిటం జెందవట్లుగాన జేసి|| గీ|| ఇంద్రియమనంబులటు చలియించెనేని । నేఁ జలించితి నంచు నీ వెఱుఁగఁబోకు । నిశ్చలుఁడ నంచుఁ దెలియుము నిన్నుఁ గాంచి । యవియును నతి నిశ్చలములగు నంతమీఁద||

గీ|| ఆత్మతేజంబు వీక్షించు నతని మాన । సేంద్రియంబులు చేష్టల నెపుల విడిచి । యొదిగి చెదరక కదలక నూరకుండు । సింగములఁ గన్న గజములభంగి ననఘ|| చ|| అవియచలంబులయిన యెడ నారయ నేనచలుండ నంచు నీ । ప్రవిమలదృష్టిఁ జూడకుము పావని వాని చలాచలత్వముల్ । దవులవు నిన్ను నీవు సతతంబును వానినెఱుంగుచుండు సా । క్షివి హృదయేంద్రియావిషయ కేవల నిర్గుణమూర్తి నెప్పుడున్ ||సీ|| మును దండకారణ్యమున నొక్కపుణ్యాశ్రమమునఁ దాపసవేషమమరఁ దాల్చి । బ్రహ్మర్షిలోక సభామధ్యమున [illegible] సుఖాసీనత నొప్పుచున్న । నను జూడఁగాఁ గోరి మునికన్యకలు [illegible]

డుకొనిముదితయితఁడో । యితఁడో నీపతి యనియచటిమానులఁబ్రీతి విభజించి యడుగన వ్వేలఁగిసిగ్గు । కలిమివారలనందఱఁగాఁడు కాఁడ। టంచుఁదలఁయూచుచుండినత్త్రాంచినప్పు । డొకటనౌఁగాదనకనూరకుండె రత్తె। ఱంగుఁగనిసంతసించి రారమణులెల్ల ॥మ॥ స్థిరవైరాగ్యవివేకయుక్తయగు నాధీవృత్తియారీతిన । ప్పరమాభాసునకాత్మచిత్సుఖరసప్రత్యక్షపర్యంతమున్ । గరిమన్దేహగతేంద్రియాసువ్యాహంకారంబులం ద్రోచునా । త్మరతిన్నేనది కాను కానను దనంతన్నిల్చుఁగాష్ఠాకృతిన్ ॥గీ॥ ఆచిదాభాసుఁడును బుద్ధినధిగమించి । యాత్మచైతన్యతేజంబునందుఁ దనదు । వెలుఁగునైక్యంబు నొందఁ ధీవృత్తిలేక । యెండలోదీపమున్నయట్లుండు ననఘ ॥వ॥ ఇట్లు శరీరేంద్రియ ప్రాణమనోబుద్ధి సమన్వితంబయిన యహంకారంబుతో సహజతాదాత్మ్యంబుగల స్వాధిష్ఠాన చిదాభాసుండు నిద్రావసరంబున సర్వవ్యాపారంబులును జాలించి శయ్యాతలంబున స్థూలదేహంబునుం డించియింద్రియంబుల విడనాడి ప్రాణంబు డగ్గవిడిచి మనశ్చిత్తంబుల నహంకారంబునందడంచి యయ్యహంకృతిం ధీవృత్తియందొదిగించి యంతర్ముఖుండయి యవిద్యాధిష్ఠానసాన్నిధ్యంబునకు సుఖంబుగా సరిగి ప్రియమోద ప్రమోదాదివృత్త్యాత్మకానందమయకోశంబునందనకు నుపాధిభూతంబయినానావిధ వాసనావాసితంబగు ధీవృత్తిదిగనాడియనాద్యనిర్వచనీయాజ్ఞానతమోభిభూతుండై యంతట నిత్యనిరుపాధికనిరతిశయ బ్రహ్మానుభవ సాగరమగ్నుండయిన చందంబునఁ బూర్ణాధికారియై సమాధిసమయంబున మొదల నేను దృశ్యంబుగాను ద్రష్టననియును ద్రష్టనుగాను ద్రష్టసమవృత్తియును దృశ్యంబుగా పునదీనికి ద్రష్టననియును నిశ్చితంబున విజాతీయ ప్రత్యయతిరస్కారసజాతీయ ప్రత్యయవ్యవహారాంగీకారపూర్వకంబుగాఁ గేవల నిజానందానుభవపర్యంతంబశేష దృశ్యవృత్తినిషేధం బొనరించుచు ధీవృత్తిసాక్షిమాత్రస్థచైతన్యసామీప్యంబునకుఁ జనుచుండ నప్పు డఖండసచ్చిదానందస్వరూపాత్మసాక్షాత్కారంబగు నప్పుడు ప్రచండాతప మధ్యనిక్షిప్తకర్పూరదీపంబుభంగిఁబరిపూర్ణ ప్రత్యగభిన్న పరబ్రహ్మచైతన్యంబుతోనేకీభూతుండై యానందింపుచుండు నిట్టుండు నతండు తన్నుఁగాఁగనుంగొనుచుఁ దనకునభిముఖుండయి యుండమిం జేసి యమ్మనంబు జడంబుగావునని వాతదీపంబుభంగిఁ గదలకయుండియు సంకల్పరూపంబుగాఁ బరిణమింపమిం జేసి లేని యట్లుండు నిదియె సహజామనస్కరాజయోగ సమాధి యిదియె జీవన్ముక్తి యనియుప

జేశించు నేడనిజముఖారవిందంబు విలోకింపుచు ముసిముసినగవులునను సీతాదేవి నెమ్మొగంబువీక్షించి వికసితవదనకమలుండయి యవ్విశుద్ధసత్త్వ బ్రహ్మైక్యజ్ఞానాకారవృత్తియే యిప్పరమపతివ్రతాశిరోమణియగుజానకి నిత్యానపాయినియు సర్వాభీష్టఫలప్రదాయినియు వశవర్తినియు నయియుండు నీధీవృత్త్యధిష్ఠాన శుద్ధచైతన్యంబు మత్స్వరూపానుభవంబు సేయునని జ్ఞానముద్ర చేనభినయించి చూపి క్రమ్మ ఱనిట్లనియె॥

గీ॥ ప్రేమతోడను శ్రీరామరామరామ। యనుచు సతతంబు మత్స్వరూపానుభవము। సేయువారలందఱకు నీసీతమిగుల। నెట్టివారల జిక్కులం బెట్టునఘ॥ సీ॥ ఉన్నది లేదనియూహింపంగా నేర్చు లేనిది కలదనలెస్స నేర్చు। నజడంబు జడమని యాంగడింపంగ నేర్చు జడమజడంబని చాటనేర్చు। సుఖముదుఃఖంబుగా చూపి చెప్పంగ నేర్చు దుఃఖంబు సుఖమనం దొలుత నేర్చు। సిరియది గాదని యింపుగా ననన నేర్చునది యిది గాదనియనంగ నేర్చు। బిదపకలది యొకలదు లేనిది యొలేదు। కడంగియజడంబె యజడముజడమజడము। సుఖమె సుఖముతలంపనసుఖమసుఖము। యదియది యెయిదియిదియనియాడనేర్చు॥

వ॥ అట్లుగావున సతిదుర్ఘటకారిణియు బ్రహ్మైకత్వవిద్యాస్వరూపిణియు మదీయయోగమాయాశక్తియు నిత్యానపాయినియుం బరమతపావనియునైన యీసీతాభగవతిం బ్రసన్నముఖనభిముఖింగావించుకొనుము నీకతిశ్రేష్ఠంబుగా నిత్యనిరుపాధికనిరతిశయనిర్మలనిజానందానుభవంబు గలుగు నయ్యుపాయంబు చెప్పెద నాకర్ణింపుమనియిట్లనియె॥

క॥ గౌరీశివాదులాత్మా। కారాకారితసువృత్తిగతినాయందుం। జేరి రమించుచునుందురు। కారణముగ రామపదముగలిగెన్నాకున్॥

గీ॥ జగతినిట్లు రామశబ్దవాచ్యుండనయిన। నేనుబుధులుబుద్ధిస్థానసేంద్రియాంగములునవాత్మయనికడం ద్రోయంగ। మిగులుమనుజిదాత్మనగుచునవుడు॥ క॥ సారబ్రహ్మాకారా। కారితధీవృత్తినాకుంగలుంగుటవలనన్। శ్రీరామనామమొప్పెను। శ్రీరమణియ బ్రహ్మవిద్య శ్రీయనందగుటన్॥

గీ॥ తలంపఁధీవృత్తికిన్ ప్రోద్భుద్రష్టనగుచుం। బ్రత్యగాత్ముండనయిన నాభావమరసి। తెలియుటను నొప్పు మతియా ద్వితీయరామ। నామము సమస్తవేదాంతధామమగుచు॥ గీ॥ అతతప్రత్యగాత్ముండనయిననేను। బ్రహ్మరూపుండనన్నినాస్వభావమరసి। తెలియుటను నొప్పుమతి యాతృతీయరామ। నామముత్కృష్టరవిలక్షణంబునగుచు॥ గీ॥ ప్రేమ చేనిట్లు శ్రీరామరామరామ।

యనుచునన్నుభజించు మహాత్ములకును । మిగులనిత్యానపాయినియగుచు యోగ । స్థితిగావింపుచుండు నీ శ్రీవధూటి ॥ వ ॥ అట్లుగావున ॥ మ ॥ తల పంబూర్ణమునిర్వికారమగు తత్త్వంబిట్లుభాసిల్లఁగాఁ । దెలియన్నేరక మూఢులయినన గలీడే హింద్రియ ప్రాణ ము । ధ్యుల నెల్లప్పుడు నిగ్రహించు టకునేంతోకతలయియాత్మనిం । దెలియంజాలుదు వారికింగలుగనే ధీసా క్షినీక్షింపఁగన్ ॥క॥ సర్వేంద్రియముల చేత । త్సర్వవిషయముల నెఱుంగు చందంబునఁద । త్సర్వజ్ఞుసర్వగతుఁడన్ । సర్వమయుం దెలియవచ్చు సమర సదృష్టిన్॥వ॥ అట్లుగావున ॥సీ॥ ఘటశరావాదిమృత్కార్యజాతంబుల నెం చిమృత్తికయనికాంచుపగిది । నమలకుండలకిరీటాది భూషణములు స్వర్ణం బనిరోయుంగుచుండమునను । నసికంఠశూలవ్రాదికంబులనెల్లనినుమనియ రసికన్గొనినభంగిఁ । బొలుపారుఫేనబుద్బుదతరంగములనుమండనీరనివిలో కించురీతిఁ । దనరుబహువిధపటములుతంతువనుచుఁ । దెలియుకైవడిమొ దలిసందియముపిడిచి । భ్రాంతినిదోలంగిసర్వంబుబ్రహ్మమనుచు । సుఖము గాసంతతంబునుచూడుమనఘ ॥సీ॥ స్థూలశరీరంబు సుస్థిరంబుగనుండు సక లేంద్రియములుపశాంతిఁబొందు । సన్మనఃపవనముల్ చంచలింపకయుండుఁ గామాదిశత్రువర్గమునశించు । స్ఫురదమానిత్వాదిసుగుణముల్సమకూడు ఘనగుణాతీతలక్షణముపొదవుఁ । బొలుపారవైరాగ్యబోధోపరతులు సం పూర్ణంబులయి మరిఁబొదలుచుండుఁ । బరమసుఖవార్ధియుప్పొంగిపా ఱుచుండు । ముందటవసించుమోహింపిమోక్షలక్ష్మి । సంశయములేమదృ ఢముగాసంతతంబు । సర్వమును బ్రహ్మమనిచూచుశాంతినిధికి॥

క ॥ రాజత్వమమరినంత నె । భూజనములువానిఁజేరిపూజించుగతిన్ । రాజితసర్వజ్ఞుఁడనుఁగా । యోజింపనయుపు డెపొందును త్రిగుణముల్ ॥

గీ॥ తరుణివేషంబుగైకొన్నపురుషుఁడరయఁ । బురుషుఁడనుఁగాకపరి కింపఁదరుణియగునె । జీవభావంబుచేకొన్నకేవలాత్ముఁ । డాత్ముఁడనుఁగా కమతిజీవుఁడగునెతెలియ ॥గీ॥ దంతిరూపంబుచేనున్నదారువరయ । దారు వనుఁగాకపరికింపఁదంతియగునె । విశ్వరూపంబుచేఁదోచువిష్ణుమూర్తిన్ । వి ష్ణుఁడగు గాకపరికింపవిశ్వమగునె ॥ఉ॥ వారణమంచుభ్రాంతుఁడగువానికి దారువుదోఁపదాక్రియన్ । దారువటంచుగాంచువిహితజ్ఞునకుంబరికింపఁగ ల్గునే । వారణమట్లుసర్వమనువానికిఁబ్రహ్మముగానుపింపద । ట్లారకబ్ర హ్మమంచుఁగనుయోగికిసర్వముగన్పితోఁచునే॥

వ॥ అనినవిని హనుమంతుండు సీతారామునకిట్లనియె.

క॥ మీరలు చెప్పినవిధమున । వారసి సర్వంబు బ్రహ్మమనికనుఘనుండే। ప్రారబ్ధవ్యవహారం । బేరీతిం జేయుదీని నెఱిఁగింపుతగన్॥

వ॥ అనిన శ్రీరామచంద్రుండు వ్వానరేంద్రునకిట్లనియె,

చ॥ ఘటకటకోర్మికాపటసికాయములన్ సువివేకదృష్టిచే । దటుకునమృత్సువర్ణజలతంతువులంచు నెఱింగినంతనే । స్ఫుటతరనామరూపములు పోవమినన్నియు గార్యకోటికై । ప్రటివలె వచ్చువచ్చినసు బాధకమున్నదె హేతుదృష్టికిన్ ॥ శా॥ ఆరీతిన్ సకలంబు తత్త్వమనివిఖ్యాత్మయోగంబుచే। వారూఢింగను యోగికెయ్యెడ నదీయాంగేంద్రియాతాళికిం । బ్రారబ్ధానుభవంబు గల్గునటులో ప్పారంగ దాద్రష్టము౯ । సారోదారవిచారదృష్టినరయున్ నద్వంబు బ్రంహంబుగాన్ ॥ శా॥ గానంబున్నటనంబు తాళగతులం గావించుచుం జాణవి। ద్యానయుపుణ్యము పల్కుచున్ శిరముమీఁదన్ గల్గుపెన్నొంతరన్ । బూనంగ యుకొను వాట్యశీలుని తిన్ బుంఖానుపుంఖంబుగా । నానాధర్మానుభవజ్ఞుడయ్యు బుధుడానందాత్ముఁగాంచున్ నుడిన్ ॥ చ॥ స్వకృతవిచిత్రపట్టణమసన్మయమంచు నెఱింగి భ్రాంతినొం । దకనిలిసం ద్రజాలకుడు దాసిసృజించువిభంబునన్నిజ। ప్రకృతికృత ప్రపంచమున భావముగా వివరించి కాంచిత । ద్వికృతులు చెందకన్ ఘనవివేకియొనర్చు సమస్తకార్యములు ॥ మ॥ శివజీవయుక్యసమాధియుండు విలపచ్చిన్మాత్రతత్త్వంబుదా। నవలీలంగ సపూర్ణుడయి పిడపమాయాసంసృతిం జెందినందపులనెన్నదున్ నె యోగిపాలు పెరుగయి ద్రచ్చంగవేఱయిన యా ॥ నవనీతంబికజల్లలో గలయునే నానాప్రకారంబులన్ ॥ గీ॥ ప్రజ్వలత్పావకావృతపర్వతంబు । నాశ్రయించునె మృగవిహంగాదికములు । బ్రంహమయుడయి ప్రకాశించు బ్రంహవిదుని । నంటునే పుణ్యపాపంబులాంజనేయ ॥ కవిరాజవిరాజితము ॥ తరణిసమస్తరసంబులు గ్రోలుచు దద్రసనిష వికారములం । బొరయనిచందమునన్ విషయంబుల బొందుచు దద్గుణదోషములన్ । న్నిరతము సంటక యోగిపరుండతినిర్మలనిశ్చలమానసుడయి ॥ పరమసుఖామృతవార్ధి నిమగ్నుడు భావనుడయి విలసిల్లుదగన్ ॥ తోటకవృత్తము ॥ చారువివేకియసారమహార్ణవం । సారము జెందియసంగతనుండగున్ । నీనగజపత్రమునీరము నేప్రా। ధారయనంటియునంటనిభంగిన్ ॥ గీ॥ పావకుండు సర్వభక్షకుండయ్యు నిర్దోషుడయినభంగి దూరదర్శి ॥ విషయరాగియయ్యు వీతరాగియునయివెలుంగుచుండుముక్తసంగుడగుచు ॥ గీ॥ తనరు సాత్త్వికరాజసతామసములబొం

గనిపొందఁడునిర్గుణానందపరుఁడు। మంటినంటియునంటకనుంటి మెలఁగు। విమ
లమూర్తిఁ గూటకంబుచందమునరనఘ॥ చ॥ పరపురుషామరక్తిగలభామిని యెల్లప
నుల్ గృహంబునం। బొరిబొరి జేయుచుం బ్రియునిపొందుసుఖంబుగఁజూచురీ
తి భాస్వరపరతత్త్వవేదినిజవర్ణనిజాశ్రమయోగ్యధర్మముల్ ॥ నిరతముస
ల్పుచుం బరమనిర్మలసౌఖ్యముఁ గాంచు నైమషి॥ వ॥ అట్టిమహానుభావుండు
ప్రారబ్ధవశంబుచే స్వవర్ణాశ్రమోచిత ధర్మంబుల యందు బ్రవర్తించుచు స
మయంబున॥ రగడ॥ మొదలుసరిగాఁగను మోదమును ఖేదమును। వదలుకొని
యుండుఁబరవాదమును భేదమును। గలకపటిసల్పుడుపికర్మమును గర్మము
ను॥ దలపడొకయించుకయధర్మమును ధర్మమును। మరలుకొని చేయఁడభి
మానమును మానమును। మఱచియును మానఁడిదిమానము సుజ్ఞానమును॥ గ్రిందు
కొనిపొందఁడు సుకాంతలను పింతలను। జెందఁడితఁడు విషయచింతలను వంతలను।
సొలయకజయించునతిసుప్తియును సుప్తియును। దెలిసికను నాత్మసుఖతృప్తియు
ను జ్ఞప్తియును। లౌల్యమతిఁ జాల్పఁడభిలాషమును వేషమును। దుల్యముగఁ
గాంచుఘనతోషమును రోషమును। జెలులపైనుంచఁడిలస్నేహమును మో
హమును। దెలియఁడిదిసత్యమని దేహమును గేహమును। విరసముగ నెంచు
నలవిత్తముల మొత్తముల। సరసముగ నెంచుమదిసత్తములఁజిత్తముల। భ్ర
మగొని భజింపఁడిలఁబౌత్రులను బుత్రులను సమముగఁ దలంచును శత్రు
లను మిత్రులను। గరమభిలషింపఁడొకకల్మియును బల్మియును। సిద్ధియును
కోనుఁ బుధులచెల్మియును జాల్మియును। సడలఁడొకయింతయును శాం
తియును దాంతియును। గడకఁ గనిసుముఖకాంతియును శాంతియును।
బ్రాపనుచుఁజూచు గురుభక్తియు విరక్తియును। నోపికనెఱుంగు శ్రుతి
యుక్తియును ముక్తియును॥ వ॥ అనిమఱియు నిగిశాస్త్రోక్త ప్రకారంబంకనను
భవంబువినుము॥ మ॥ తలఁపరాగాధవిరక్తియుక్ స్ఫుటతరాద్వైతాత్మవి
జ్ఞానము। జ్జ్వలపర్యేంద్రియమాన సోపరతియుక్ సంపూర్ణమయినిత్య
ముక్। వెలయంగాఁదమఁగాంచు కేవలునకున్ విశ్వంబుచూపట్టునే। కల
లోఁగన్నగజంబు మేలుకొనినంగన్పట్టునే మారుతీ॥

వ॥ ఇంకనొక్కవిశేషతాత్పర్యంబు వివరించెద నాకర్ణింపుము బ్ర
హ్మవిదుండును బ్రహ్మవిద్వరుండును బ్రహ్మవిద్వరీయుండును బ్రహ్మవిద్వ
రిష్ఠుండును ననమత్స్వరూపతత్త్వజ్ఞులనఁబురుగలరందు దేహేంద్రియా
దికర్తృత్వంబును గర్మఫల కాంక్షయు లేకనిత్యనైమిత్తికంబులయిన య

జ్ఞదానతపంబులు మొదలయిన వైదికకర్మంబులు యథావిధిగా నాచరించుచుఁగామ్యకర్మంబులు విడిచి శాస్త్రగర్హితంబులు గాని లౌకికకర్మంబులుయథోచితంబుగా నొనర్చుచుఁ బుత్రమిత్రకళత్రవిత్తక్షేత్రాదులయందువైరాగ్యంబు గలిగియదృచ్ఛాలాభసంతుష్టుండును గామరాగద్వేషభయలోభమోహమదమత్సరాదినానావిధచిత్తవికారరహితుండును సతతవిజితశరీరేంద్రియప్రాణాంతఃకరణుండును నిరహంకారుండునునిత్యప్రసన్నచిత్తుండునుఁ బరమకారుణికుండునుఁ బరమశాంతుండును జ్ఞానవిజ్ఞానసంపన్నుండును సంతసస్సుఖుండును నంతరారాముండును నంతఃప్రకాశుండును నాత్మరతుండును నాత్మతృప్తుండును నాత్మసంతుష్టుండును వైసంచరించునతండు బ్రహ్మవిదుండు -మఱియు సకలవైదికలౌకికకర్మంబులు విధిపూర్వకంబుగా సన్యసించి పూర్వోక్తలక్షణంబుల గలసిద్ధిసంప్రాప్త దుఃఖంబులను ద్వేషింపకనివృత్తసుఖంబులు గోరక ప్రకాశ ప్రవృత్తిమోహంబులను దాసీనుని చందంబునఁజూచుచు సుఖదుఃఖ మోహాదికార్యాకార్యగుణంబులయందుఁజిత్తేంద్రియాదికారణకార్యగుణంబులు ప్రవర్తించుచుండవాని చేతంజలింపఁజేయఁబడక నిశ్చలుండును సమదుఃఖసుఖుండును స్వస్థుండును సమలోష్టాశ్మకాంచనుండును దుల్య ప్రియాప్రియుండునుదుల్యనిందాస్తోత్రుండును దుల్యమానావమానుండును దుల్యశత్రుమిత్రపక్షుండును సర్వారంభపరిత్యక్తసర్వారంభుండును నగుగుణాతీతుండు బ్రహ్మవిద్వరుండనందగు - మున్నువివరించినగుణంబులన్నియుఁ బ్రకాశించుచుండు సంతతసహజామనస్కరాజయోగనిష్ఠాగరిష్ఠుండయి యెడనెడఁ బరులవలన మేలుకొలుపంబడికించిదాహారంబుగొనుచు సుప్తుండయిన వాని తెఱంగున విశ్వంబు మఱచియుండు నతండు బ్రహ్మవిద్వరీయుండు - దనవలననునొరులవలననుపురుత్థానంబులేక బాహ్యాభ్యంతరంబులు మఱచి నిరంతర నిర్వికల్పసమాధిస్థుండయి పరిపూర్ణప్రత్యగభిన్న పరబ్రహ్మచైతన్య ప్రకాశమాత్రుండునునయి వెలుంగునతండు బ్రహ్మవిద్వరిష్ఠుండనందగు - నందు మొదలియిరువురకు బ్రారబ్ధంబుదోచియు మిథ్యాభూతంబయియుండు వరియనందు గలిగియు లేకుండు వరిష్ఠునకేమాత్రంబు లేదు గావున నిమ్మహానుభావుల యనుభవంబులు నీవడిగినప్పటినుండి యేపరి ఱచి చెప్పితిగాదే యని వెండియు నిట్లనియె॥ ...

గీ॥ అతులవైరాగ్య

నలువురగదు | సుఖములాశించు మించులుగనుండుఁ | గాని కేవలమో
క్షమొక్కటియె వత్స ||గీ|| అతులవైరాగ్యబోధోపరతులయతుల | మతుల
వెడబాయ వన్యోన్యగతులనెనసి | మూటిగప్పియొకానొకచోటనొండు |
రెండు ప్రతిబంధవశమునయుండుననఘ| ... ... ...

గీ॥వీనిలోబోధ మెక్కుడాజ్ఞానమునకు | గడమ రెండును దగసహకారులర
రయ | వరసమూహమునుగలిగిన వాగలకును | కరతలామలకంబు మోక్షంబువత్స
క॥అతుగతత్త్వజ్ఞానము | సాక్షాన్మోక్షప్రదంబు సంసారికము | క్షతుయకర
మగుదక్కిన| లక్షణములుసుఖకరములులలితాత్మునకున్ ||క|| కారణముదోష
దృష్టియె | వయిరాగ్యమ్మునకుసహజవరరూపమువం || సారికసుఖములునర
లం|గోరకయుండుటయెసుమ్ము గురుకార్యమగున్ ||మ|| శ్రవణాదిత్రితయం
బుకారణమనస్సత్త్వంవిధానంబుశు | ద్ధవిబోధంబునరున్ స్వరూపమున నాత్మ
స్వాత్మతాదాత్మ్యసం | భవరాహిత్యము కార్యమాయెన ముఖాభ్యాసా
త్మధీనిగ్రహ|వ్యవహారక్షయముల్ తలంపనుపరత్యాసద్విరూపార్థముల ||
శా॥ వయిరాగ్యంబుదృఢంబుజేసిపరతత్త్వజ్ఞానమార్జించిన | త్యాగంభోప
రమంబుగయిక్కొనదురితయంబందియూతిరెమో | గాఢుండగు వానికింగలు
గు నే?యాగామియున్సంచితప్రారబంబులు సంతతంబును బరబ్రహ్మోడయి
యుండగాన్||కం|| వయిరాగ్యంబింతటికిని|గారణమానందకరముగావునన వి
వే|కూటీనసమస్తముకుసను | కూహుంననుదాన|పరమగుహ్యమిదిసుత్రా-

వ॥అది యెట్లనినవినుము మూలప్రకృతి యగాలవాలంబు సుదుఃఖంబులు
ఫలంబులు త్రిగుణంబులు మూలంబులు ధర్మార్థకామమోక్షంబులు ర
సంబులు పంచేంద్రియంబులూడలు పదార్థంబులు స్వభావంబులు సప్తధాతు
వులు పొరలు సప్తప్రకృతులు విటపంబులు నవరంధ్రంబులు కోటరంబులు దశ
విధప్రాణంబులు పత్రంబులు శబ్దాదివిషయంబులు పల్లవంబులు రాగద్వేషా
దులు పశాఖలు నానావిధకర్మంబులు పుష్పంబులు జీవేశ్వరులు పక్షులు
గాగలిగి మందిరారామ క్షేత్ర పుత్ర మిత్ర కళత్ర బంధుమధ్యసద్వేష్యజనతీ
ష్ణగుచ్ఛకంటకతరుగుల్మలతాసంకీర్ణంబును గామాదిచోర దుస్సంచారం బు
ను రోగవ్యాఘ్రభయంకరంబును దుఃఖ దావానలసమావృతం బును మృ
త్యుసింహభయగ్రస్తంబును జరాపిశాచసమన్వితంబును దైన్యపర్వతసం
కటంబును దురితరాక్షసఘోరంబును దృష్ణాభీకర శాకోదగసమాకులం
బును హాషా... హాషితంబును స్వర్గనరకపుమార్గలి

రోహితాపవర్గ సన్మార్గంబునునైన మహాదుఃఖారణ్యంబునంగాఢ పక్షిపుణ్యాపాపసిద్ధియుండయి జీవుండంతటం దిరిగితిరిగి చీకాకుపడియచ్చోటవిశ్రాంతిగానక విసివిముందరగాంచి యనంతంబనియును వెనుకఁజూచిన సనాదియనియును గలయఁగనుంగొని యసాధ్యంబనియును దెలిసిమహాగాఢదుఃఖభయశోకవ్యాకులిత చిత్తుండును దాపత్రయాదిత్య ప్రదీప్తాతపసంతప్తుండునునై యంతటనితాంతాగమచ్ఛాయల నాశ్రయించి స్రక్చందనవనితాధనధాన్యపశుసంతానశయ్యా నికేతనోద్యాన ప్రముఖవిషయ సంపాదనసాధనంబులయిన కృషి వాణిజ్య సేవాయాచ్ఞాది లౌకికకర్మంబులు పరిహరించి స్వర్గాదిసత్యాంతపరలోకవిషయ సుఖసాధనంబులయిన నిత్యనైమిత్తికాది కర్మంబులు ఫలకాంక్ష చేతఁజేయక పరమేశ్వరార్పణంబుగా నాచరించి యప్పరమేశ్వరానుగ్రహంబువలనఁ బరిశుద్ధహృదయుండయి యమానిత్వంబును నదంభిత్వంబును నహింసయు నార్జవంబును క్షాంతియును నాచార్యోపాసనంబును శౌచంబును స్థైర్యంబును నాత్మవినిగ్రహంబునునింద్రియార్థవైరాగ్యంబును ననహంకారంబును జన్మమృత్యుజరావ్యాధి దుఃఖదోషాను దర్శనంబును బుత్రదారగృహాద్యనాసక్తియున నభిష్వంగంబును నిత్యేష్టానిష్టోపపత్తి సమచిత్తత్వంబును మయనన్యయోగ నిశ్చలభక్తియువివిక్తదేశ సేవిత్వంబును జనసంగాసక్తినివర్జనంబును నధ్యాత్మజ్ఞాననిత్యత్వంబును దత్త్వజ్ఞానార్థదర్శనంబును నను వింశతిగుణంబులెప్పుడు సంగ్రహించు నప్పుడాత్మ బ్రహ్మైక్యసాక్షాత్కారేచ్ఛాధికారియగు నింతవట్టునుంగూడి వైరాగ్య శబ్దంబునకుఁ దాత్పర్యార్థంబింకబోధస్వరూపం బెఱింగించెద నాకర్ణింపుమని యిట్లనియె॥ ... ... ... .. ... ... *

గీ॥ అట్టిసుగుణాభిరాముఁడత్యాస్తికతోడ। శాంతచిత్తుండు గారుణ్యాగరుండు। జ్ఞానవిజ్ఞానసంపన్నుఁడైన గురుని। వినయభయభక్తులమరసేవించుననఘు। క॥ గురుఁడజుఁడు గురుఁడు విష్ణుఁడు। గురుఁడు మహాదేవుఁడఖిలగురుఁడు సదాశివుఁ గురుఁడైపరబ్రహ్మంబని। గురునినుపాసించునతఁడు గురుతభక్తి॥ సీ॥ గురుపదాంభోజముల్గొలువకకల్గునే ప్రవిమలవైరాగ్యభాగ్యమహిమ। గురుపాదతీర్థంబుగ్రోలకకల్గునే జ్ఞానవిజ్ఞానయోగానుభవము। గురుప్రసాదంబుగొనకున్నఁగల్గునే ప్రతిలేనిచిత్తోపరతిసుఖంబు। గురుతత్త్వమాత్మగన్గొనకున్నఁగల్గునే నిరతిశయంబైనపరమపదము। నట్లుగావున

విద్యాస్థిరయైనయోగి। వినయభయాభవులెడలోనఁజెనగొనంగ । నలచతుర్వి ధశుశ్రూషలాచరించి। కొనుచుననిశంబుగురువులఁగొలుచుననఘ॥ క॥ వా రలయుపదేశముచే। దారకసాంఖ్యామనస్కతత్త్వాత్మకమా। శ్రీరాజయో గమార్గం। బారూఢముగాఁ దెలుగునంతటననఘా॥ వ॥ అదియెట్లంటేని॥ ము॥ క్రమమొప్పారనహంపదంబునకునీకాయేంద్రియప్రాణధీ। తమనోహం కృతిబుద్ధిరూపజడజాతంబెల్లవాచ్యార్థమా। ద్యమునచ్చిత్సుఖరూపమైతనకు శుద్ధప్రత్యగాత్మప్రకాశములక్ష్యార్థమువేదశాస్త్రగహస్యంబింతనిక్కం బుగా॥ క॥ సర్వమువాచ్యార్థముతత్। త్సర్వాధిష్ఠానశుద్ధచైతన్యముగ। బ్బూ ర్వకలక్ష్యార్థంబును। సర్వవినుతవినుమ బ్రహ్మపదమునకరయుగా। గీ॥ ఉభ యవాచ్యార్థములతోడనొప్పుచున్న। యుభయలక్ష్యార్థములకైక్యమొదవ దట్లు। గాన వాచ్యార్థముల రెంటిఁగడకుద్రోచి। యెనయలక్ష్యార్థమొకటి గా నెఱుఁగవలయు॥ వ॥ అదియెట్లంటేని॥ సీ॥ అద్వితీయప్రత్యగాత్ముండనగు నేను పరిపూర్ణనిర్గుణబ్రహ్మనుగుదు। బరిపూర్ణనిర్గుణబ్రహ్మంబెయద్వితీయ ప్రత్యగాత్ముండనైననేన। టంచునీరీతినహంబ్రహ్మపదముల వాచ్యార్థము లనెల్లవదలిశుద్ధలక్ష్యార్థములుగొనిలక్షణచేదత్త దన్యోన్యసమర్థనైక్యం బుగనుట। యసియనుపదంబునకునర్థమగును గాన। నిమ్మహావాక్యతాత్పర్య మిట్లుసద్గు। రుప్రసాదంబువలననిరూఢముగను। బాధకంబుగ నెఱుఁగుటబో ధమనఘ॥ క॥ నిత్యముగాదేహాత్మ। ప్రత్యయమజ్ఞానకుగల్గుపరిపాటిగం। బ్ర త్యగభిన్నబ్రహ్మ। ప్రత్యయమొప్పారవలయుఁబండితునకిలగా॥ గీ॥ ఇదియెబో ధప్రకారమాసంకనిరు। నుపరతివిధంబువినుపింతునోనరవినుము। ఉత్తమో త్తమమైయొప్పుచిత్తశాంతి। బ్రహ్మవిద్యాగమమునకుఫలమువత్స॥ ... *

## ఉపరతినిర్ణయము.

చ॥ ఉపకృతిదానభోగములకొప్పనిమత్త్యానికల్మిశీలమెల్ల। పుడును లేని విప్రునిగ్రామాధ్యయనంబును నెమ్మనంబునగా। విపులశమంబుగైకొన నవీరత పస్వితపంబునింద్రియా। ద్యుపరతిసౌఖ్యముంగననియోగివివేకముతిత్తయా రయగా॥ సీ॥ వేదశాస్త్రంబులువివరించిబుధులచేఁ జదివింపవచ్చుఁదాఁజదు వవచ్చు। యజ్ఞదానతపంబులధికారిజనముచేఁ జేయింపవచ్చుఁదాఁజేయవ చ్చు। నిలలోనగలతీర్థములకేఁగనన్యుల బోధింపవచ్చుఁదాఁబోవవచ్చు। నష్టాంగయోగవిద్యలువార్యులకుపదేశింపవచ్చుసాధింపవచ్చు। గానియె వ్వారికైనవిజ్ఞానయోగ। గతినినేహేంద్రియములరికట్టిమనము। వాగియం

తత్సుఖముఁ జేసియనవరతము । నిశ్చలసమాధినిష్ఠ చేనిలుపరాదు ॥ క ॥ జితేం
ద్రియోపరమము మ । హాత్తరమిది యెల్లవారికబ్బదువినుము । యుక్తమనస్కగ
లిగినవి । ద్వృత్తముఁడతిదుర్లభుఁడుసదాతన్మయుఁడుఁ ॥ గీ ॥ కొందఱాత్మతత్త్వ
ము నెఱుంగుదుమటంచు । గర్వులై సిక్కి చిత్తనిగ్రహము లేమి । నుపరతిసుఖం
బుగానకవిపులవిషయ । రాగలోలతఁ జెడుదురూరక మహాత్మ ॥ గీ ॥ జ్ఞానవిజ్ఞా
నయుతుఁడయ్యు సంతతంబు । నాత్మభావన లేకున్నయతనినింద్రి । యంబులు
మనంబుతమకు వశంబుచేసి । విషయసుఖములఁ దవిలఁజూపి వెతలఁబెట్టు ॥ సీ ॥
అట్లుగావుననింద్రియమనంబుల నజస్రమాత్మభావనచేత నాఁగఁబట్టి । యంత
ర్ముఖములుగా నలరిందియామీఁదఁ గామాదిశత్రువర్గమునడంచి । విమలబో
ధాకారవృత్తిచేఁ గేవలపరిపూర్ణతత్త్వరూపమునుఁ గాంచి । యానందమూ
ర్తియై యఖిలంబు తనయందు సమమునుంచి చిత్తవిశ్రాంతినొంది । యెఱుకమ
ఱపులఁబొరయనియెఱుకగాసైన । పరమపురుషుండుసుస్థిరప్రజ్ఞుఁడనఘ । జాగ్ర
త్స్వప్నాతీతుఁడనన మనస్కరాజ ః। యోగనిద్రాసమేతుఁడై యుండునఘ ॥ గీ ॥
ధర్మవిధి నెవ్వఁడు మనోగతంబులైన । సర్వకామంబులను గడుసన్యసించి
యుండి తాత్మాత్మసంతుష్టుఁడగుచునుండు । నాతఁడాత్మస్థితప్రజ్ఞుఁడగుకుమా
ర ॥ గీ ॥ ప్రాప్తదుఃఖములకుభయపడక నోర్చి । కోసరియు ప్రాప్తసుఖముల
గోరికొనక । వీతరాగభయక్రోధుఁడై తనర్చు । నాతఁడాత్మస్థితప్రజ్ఞుఁడగు
గపీంద్ర ॥ గీ ॥ అఖిలవిషయానభిస్నేహుఁడగుచుశుభము । నొందిముదిమియక
రశుభంబునొందికినియు । దుండునెవ్వఁడుసమతనప్పుడిటుండు । సంస్థితప్ర
జ్ఞుఁడగుసూరిజనవరేణ్య ॥ గీ ॥ కూర్మమఖిలావయవములఁ గుదియమునుచుమా
ర్కెనే యోగియింద్రియమానసముల । ననురమరలించు నింద్రియార్థములవల
న । నాతఁడాత్మస్థితప్రజ్ఞుఁడగుమహాత్మ ॥ గీ ॥ వినుమొకరహస్య మెఱిఁగింతు వే
యునేల । యేమహాప్రాజ్ఞునకు మానసేంద్రియములు । పంచినట్లాజలోన
ప్పపనులు సేయు । నాతఁడాత్మస్థితప్రజ్ఞుఁడగుఖగేంద్ర ॥ గీ ॥ ఎల్లభూతముల
ఁ నేదిశర్వరిదాని । యందుమేలుకనిమహాత్ముఁడలరు । నఖిలజగము దేనియం
ఁ మేల్కనియుండు । నదియెనిశజితేంద్రియాత్మునకును ॥ వ ॥ అట్లుగావుననిం
ద్రియమనంబులనాత్మనిషేధపూర్వకాత్మాలోకనంబుచేత జయించిపవి
త్ర మానసేంద్రియుండగు నపుణ్యపురుషుండు సర్వభూతాద్వేష్టయును స
కలలోకమిత్రుండును బరమకారుణికుండును నిర్మలుండును నిరహంకారుం
డును క్షమావంతుండును నిత్యసంతుష్టుండును యోగారూఢుండును నియ

తాత్ముండును దృఢాత్మనిశ్చయుండును నిఖిలజనాభయప్రదుండును నఖిలలోకభయరహితుండును ముక్తహర్షామర్షభయోద్వేగుండును నిరపేక్షుండును శుచియును దక్షుండును నుదాసీనుండును గతవ్యథుండును బరిత్యక్తసర్వారంభుండును నిష్టానిష్టప్రాప్తిహర్షద్వేషవిహీనుండును సంప్రాప్తేష్టవియోగదుఃఖవిరహితుండును నప్రాప్తార్థకామశూన్యుండును యదృచ్ఛాలాభసంతుష్టుండును శుభాశుభపరిత్యాగియు సమశత్రుమిత్రుండును సమలోష్టాశ్మకాంచనుండును సమశీతోష్ణసుఖదుఃఖుండును దుల్యప్రియాప్రియుండును దుల్యనిందాస్తుతుండును మానావమాన తుల్యుండును మౌనశీలుండును ననికేతనుండును స్థితప్రజ్ఞుండును గుణాతీతుండును మద్భక్తుండును మదర్పితమనోబుద్ధియు నుత్పరాయణుండును నయి ప్రకాశించుయోగీంద్రుండు సంతతసహజామనస్కరాజయోగసమాధియందుసూర్యుండు సముద్రరసంబులంబీల్చిన తెఱంగునబడబానలంబు జలరాశిని పానంబుచేసిన కైవడిమహాదవానలం బరణ్యంబునంగలతృణాదిసర్వపదార్థంబులంగబళించిన తెఱంగునవావిద్యకంబులయిన యనంతగుణంబులను నశేషంబుగామ్రింగి కేవలపరిపూర్ణశుద్ధచిన్మాత్రస్వరూపకుండయియుండు నద్దశావిశేషంబు వర్తియునచెప్ప నయ్యుపరతిప్రాప్తికియమంబును నియమంబును ద్యాగంబును మౌనంబును దేశంబును గాలంబును నాసనంబును మూలబంధంబును దేహసామ్యంబును దృక్స్థితియును బ్రాణాయామంబును ప్రత్యాహారంబును ధ్యానంబును ధారణయు సమాధియునను పంచదశయోగాంగంబులు సాధనంబులుగావున వానివేర్వేరవిభజించెద వాకర్ణింపుము॥ మ॥ శమతన్మాజిలవహ్నివాయుఖతనూసర్వేంద్రియప్రాణచి। త్తనుమోహంకృతిబుద్ధిరూపబహిరంతస్సర్వదృశ్యముల్ దృక్స్వరూ। పముగాఁజూచుచుదన్నగాత్మకపరబ్రహ్మంబుదానందుని। త్యముభావింపనౌయమంబిగియచింత్యంబంజవానందవా॥ సీ॥ వినుచుముట్టుచుఁగనుఁగొనుచువానుచుమూర్కొనుచుఁబల్కుచుఁబనుల్గొనుచుఁజనుచు। వరాశ్రమోచితవ్యాపారములునిచ్చ సలుపుచుఁదలంచుచు మెలఁగునెడల। నీయింద్రియంబులీయింద్రియార్థములందుఁ బూవర్తించునవేనీకెల్ల। సాక్షినికేవలసచ్చిదానంద స్వరూపుఁడగుణజాతిరూపనామ। రహితుఁడనటంచుఁదెలిసినిరంతరంబుఁ। దన్నుఁదాఁజూచుకొనుచుసత్యముగనీయ ।ఖండనియమంబులవదనుండుటరయ । నియమయోగంబనందగునిర్మలాత్మ॥గీ॥ ప్రత్యగాత్మకస్వరూ

వుఁడై పరగుతనరు। నన్యమైనట్టి దేహేంద్రియాదిదృశ్య। వితతియంతయు నొల్లకవిడుచుటరయ। త్యాగమనఁ జొప్పనిది రాజయోగితిలక॥ … *

కవిరాజవిరాజితము॥ పలుకులకందక భాసిలు బ్రహ్మము తానగుచుం బలుమఱుబల్కకపల్కనఁబోనవిపల్కతినంచుఁదలంపకనే। తలఁపులు లేకనిగంతరసౌఖ్యసుధారసమందుచునుండుటని। ర్మలమగుమానముగా నతనందనమానకదీనిభజింపఁదగున్॥ సీ॥ ధీబలచేతనే దేశమాచార్యోప దేశంబునన్ బోధచేఁ దెలియఁబడియెఁ। బరమపవిత్రమై భాసిల్లునే దేశ మిలమితి నన్నిటి కెక్కుడయ్యె। నే దేశమున మానసేంద్రియప్రాణాది సంచారశూన్యమైన సమతనొప్పు। నే దేశమునసాధనేచ్ఛామనఃక్రోధ దుఃఖగంధలవంబుదోఁపకుండు

గీ॥ పరమునిరువద్రవంబు నిష్కంటకంబు। నిరతిశయమును నిత్యంబు నిర్మలంబు। దివ్యమానందమగుచునే దేశమమరు। నదియె యేకాంత దేశమో యాంజనేయ॥

గీ॥ అట్టిపవిత్ర దేశంబునధిగమించు। ఘనునకు నిరంతరసుఖంబు గలుగుఁగాన। యన్యవిజనంబు నొందు దేహాత్మవాది। కబ్బనే నిర్మలానందమనిలతనయ॥

గీ॥ కాల మిద్దాని చేఁ బరికల్పితంబు। నెల్లకాలము నొకరీతి నెద్దివెలుఁగుఁ। గాలనియమంబు లెందేనిఁ గానుపింప। దదియె కాలంబవాదియనంతమనఘ॥ గీ॥ అట్టి యాద్యంతరహితకాలాంతకాత్ముఁ। డైనిమేషాదియై పళయాంతమైన। కాలమునఁదూలకణమున ఖండదావ। శిఖిపగిద్రింగి యోగి భాసిల్లునఘ॥ క॥ చలనము కాయక్లేశము। నలసతయును జాడ్యనిద్రలాయాసంబి। మ్ములనెట్టియునికి వలనను। గలుగునదిసుఖాసనంబుకల్పితమనఘా॥ గీ॥ ఎద్దిసిద్ధమగుచునే ప్రొద్దు విలసిల్లు। నరసి చూడ నెద్దియైనయపుడె। సర్వసిద్ధలోకటసముదాయమున నదియె సి। ద్ధాసనంబు కేవలాత్మరూప॥ గీ॥ బంధములకు మూలబంధంబు ప్రకృతిత। ద్బంధమిద్దిగనినఁబాయునపుడె। యఖిలతత్త్వములకు నాదిమూలంబెద్దియది సుమూలబంధమాంజనేయ॥ క॥ వారినిధియందుఁజెందిన। యేగతిలగతి చిత్సుఖంబుననింద్రియవృత్తుల్। చేరి సమభావమొందుట। యారయఁగా దేహసామ్యమగు వాయుసుతా॥ సీ॥ యేచూపు సకలబాహ్యేంద్రియారంబులఁ గనునది వెలిచూపుకపికులేంద్ర। యేచూపు సకలాంతరింద్రియార్థంబులఁ గనునది లోచూపు కపివరేణ్య। యేచూపు బాహ్యాంతరింద్రియార్థంబులఁ గనునది మధ్యలక్ష్యము కుమార। యేచూపుదగమానసేంద్రియషట్కంబు గనునది షణ్ముఖి వనుజవైరి। చూపు నేచూపునీనాల్గుచూపులనున। జన్మమది శాంభవీసృష్టి సంగరహిత। యదియె యన్నిటిలో నెక్కుడిట్టులగుటఁ। బరమగుహ్యతమం

విదిపవనతనయ। మాలినీవృత్తము॥ దృశ్యమె వాకము దృశ్యమె భూజల తేజము
లున్। దృశ్యమె దేశము దృశ్యమె కాలము దృశ్యమె దేహములింద్రియముల్
దృశ్యమె ప్రాణము దృశ్యమె చిత్తము దృశ్యమహంకృతిధీమనముల్। దృశ్య
మె విద్యయు దృశ్యమె సర్వము దృశ్యము గాన దృక్కెఱుఁగయున్॥ గీ॥ ద్రష్టదర్శన
దృశ్యవిరామమెచట। నరునచలదృష్టి నిలువంగఁదగును గాని। చెదరి వాసా
గ్రమునఁ జూపుఁ జేర్పఁదగదు। కోరియమనస్క రాజయోగులకు వత్స॥ శా॥
ప్రాణాంతఃకరణేంద్రియాద్యఖిల సద్భావంబులన్ భూషణ। శ్రేణిన్ స్వర్ణ
ముగా నెఱింగినగతిం జిన్మాత్రముంగాఁగఁన। త్ప్రాణాంతఃకరణాదివృత్తులు
నశింపుందన్నుఁ గాఁగాంచినం। బ్రాణాయామమనంగ నొప్పునిది సంభావ్యం
బు మేధానిధీ॥ మ॥ వెలిలోఁగన్పడు నామరూపవితతిన్ వేమారు రేచించియు।
మ్ములసచ్చిత్సుఖరూపతత్త్వము మదిం బూరించియామీఁదని। శ్చలమై తన్మ
యతం దగన్ మనము శాంతంబు గుంభించినన్। సలు వొప్పన్ బుధసేవ్యమై
తనరు ప్రాణాయామయోగంబగున్॥ క॥ సత్యానృతవిషయములను। బ్రత్య
గ్బోధస్వరూపపరమాత్మునిగాఁ। నిత్యమునవలోకించుట। ప్రత్యాహారంబనం
గఁబరఁగుఁగపీంద్రా॥ గీ॥ మహితదేహేంద్రియ ప్రాణమానసాది। దృశ్య
మును గాను నేనిఁదెలియుచుండు। దృక్స్వరూపుఁడననుచుఁ జింతించుటర
య। ధ్యానయోగంబు బ్రహ్మవిద్యానిధాన॥ క॥ మదినెద్ది చూచుమదినే। య్యె
డగను గొనునదియె బ్రహ్మమనునట్లరయా। హృదయంబున నిలుపుటదీ। నదియా
పరపరమధారణాయోగమగున్॥ క॥ సర్వావస్థలయందును। సర్వంబును బ్ర
హ్మమనుచు సతతము గనినన్। సర్వవికృతిరహితసహజ। నిర్వాణసమాధియ
గు వినిర్గుణరూపా॥ క॥ ఈపదియేనంగంబుల। దీపితవిజ్ఞానసూక్ష్మదృష్టినసిశ
మున్। జేపట్టి యభ్యసించుచు। హాపురుషునకబ్బఁ బరమమగును పరమమున్॥
క॥ చిత్తోపరమము గలవుఁడు। షోత్రముఁడు జగంబు మఱచియుండున్ బాలో।
న్మత్తపిశాచసిభుండై। యెత్తఱిసు ఫునిగతిని రింద్రియుఁడగుచున్॥ శా॥ గా
లిం దూలిన వాన చేఁదడిసినన్ గాఢాగ్నిచే గ్రాగినన్। వ్యాళం బాత్మ విము
క్తకంచుకము పై వ్యామోహముం దాల్పన। ట్లాలోతాంగము పైని రూఢమ
మతాహంకారము లేకనా। త్మాలోకస్థితి నుండుఁబండితుఁడు నిత్యానందముం
బొందుచున్॥ మ॥ మదిరాపానమదాంధుఁడాత్మపటముల్ మైనుండినన్ జారి
నన్। వధలై వ్రేలినఁ జూడఁడప్పగిది జీవన్ముక్తుఁడు దృశ్యనా।థిదశా ప్రాప్త
సుఖామృతానుభవతృప్తిన్మత్తుఁడై మేను నే। మ్మది గూర్చుండిన లేదన న్న

డిచినఁ గామన్నింపఁ డేనంచు దాఁగి॥ మ॥ తరుణీనందనబాంధుసాధురిపుమిత్రవ్రా
తముల్ తన్నుఁ బల్ | మఱి నిందింపన నున్నతింపన మహామానావమానాదుల |
న్నెరిఁ బొందింపన నిర్వికారుఁడగుచున్ సశ్రేష్ఠుఁడై యుండు ఖా | స్వరతత్త్వా
నుభవజ్ఞుఁ డెవ్వఁడల జీవత్త్యక్తదేహస్థితిన్॥ గీ॥ బహువిధసంకటములు ప్రాప్తం
బులైనచోఁ | దలఁకింపఁ డాత్మతత్త్వవిదుఁడు | వాయుశీతవహ్నివరాతపం
బుల | కింపు కైన గిరి చలించనట్లు॥ వ॥ ఇట్లు వైరాగ్యబోధోపరతియుక్తుండై
జీవన్ముక్తుండు ప్రత్యగభిన్న బ్రహ్మతత్త్వసాక్షాత్కార ప్రచండ మార్తాం
డ ప్రకాశనిరస్తానాద్య నిర్వచనీయాజ్ఞానాంధకారపటలుండును బరిత్యక్త
వర్ణాశ్రమాచారశాస్త్రకోలాహలుండును నిరంతరచిత్తవిశ్రాంతి పరా
యణుండును విషయాసక్తివివర్జితుండును బబలప్రారబ్ధాధీనశరీరనిశ్చేష్టుం
డును సంతస్సుఖుండును నంతరారాముండును నంతఃప్రకాశుండును నాత్మ
రతుండును నాత్మతృప్తుండును నాత్మసంతుష్టుండును దూరీకృతదురితక్రి
యుండును బ్రశాంతమానసుండును విజితేంద్రియుండును గృతకృత్యుం
డును బ్రాప్తప్రాప్యుండును సర్వవ్యవహారాతీతుండును నశరీరుండును స
ర్వశరీరస్థుండును నిరింద్రియుండును సర్వేంద్రియద్రష్టయున ప్రాణుండు
ను సర్వప్రాణిప్రేరకుండును సర్వేంద్రియోపశాంతి సుఖరసికుండును వి
వేకఖ్యాత్సంగుండును విత్త్యాసంగుండును బ్రజ్ఞాప్రౌఢసఖీసహాయుండును
నసహాయుండును దృఢాపరోక్షాత్మనిశ్చయసంపన్నుండును వర్ణాశ్రమప
దాచారదురాచారకామక్రోధలోభమోహదంభదర్పకూహకక్రౌర్య
శౌర్యచాస్యమాత్సర్యద్వేషకార్పణ్యనిందాస్తుతిమానావమానేర్ష్యా
సూయానయానైష్ఠుర్యవాక్పారుష్యాది నానావిధచిత్తవికారరహితుం
డును స్త్రీవాసనా గృహవాసనా ప్రతిష్ఠావాసనా శాస్త్రవాసనా దేహవాస
నా లోకవాసనా కర్తృత్వభోక్తృత్వాదివాసనా వివర్జితుండును విగ
గబ్రహ్మవేత్తృత్వాభిమానవాసనుండును నిత్యనిర్మలుండును నిత్యశాంతుం
డును నిత్యోదాసీనుండును నిష్ప్రపంచుండును నవ్యక్తమహదహంకారపం
చతన్మాత్రాకాశాదిసర్వప్రపంచమాయాగంధర్వనగరాశ్రయుండును ని
రాశ్రయుండును సర్వావభాసకేవలచిదాకాశమాత్రుండును బరమసు
ఖైకస్వరూపకుండును దూరీకృతసంసారుండును దేహేంద్రియగుణాతి
క్రాంతుండును దేవతాస్పృహణీయశీలుండును నాశాపాశవినిర్ముక్తుండును రా
జసతామసవస్తుసేవాదూరుండును సాత్త్వికవస్తుసేవాజితనియముండును

తమునిర్వికల్పముపరబ్రహ్మాత్మకంబయినయా । కైవల్యంబునఁబొందుసత్య మనహంకారాత్మతత్త్వాత్మకా॥ వ॥ అనియుపదేశించి॥ ఉత్సాహ ॥ ఇదియె వేదశాస్త్రసారమిదియనంతసౌఖ్యదం। బిదియెరాజయోగశాస్త్రమిదియె బ్రహ్మవిద్యను। ద్ధ్రువయమిదియెదీనినితమెవ్వఁడేంభక్తితో। సదమలాత్ముఁ డగుచుమిగులఁ జదువవినినవ్రాసినన్॥ ... ... ... ... *

## సుందరీ వృత్తము,

యుక్తియునస్మద్భక్తియుజీవన్ముక్తియుసాయుజ్యముక్తియుఁగలుగున్॥ వ॥ అట్లుగావునఁ పరమేశ్వరుండయిన నానెమ్మనంబునం బరమనిశ్రేయసంబుగా బ్రకాశించు సర్వోపనిషత్సార భూతంబయిన యీదివ్యజ్ఞానంబును మద్భ క్తుండవు మత్కృపాపాత్రుండవు మదర్పితమనోబుద్ధి వినుత్పరాయణుండ వునగుటంజేసి నీకునుపదేశించితి నింతకంటె నతిరహస్యంబయిన యర్థంబు నాడెందంబున లేదట్లగుట నిప్పరమార్థతాత్పర్యంబుఁదెలిసి తమఃకూర్మం బును రజోమీనంబును గ్రోధనక్రమంబును గానుశైవాలంబును జన్మమర ణతరంగంబులును రోగమద్ధ్యాకంబును లోభఫేనంబును మోహవేలయు దుఃఖాగాధ జలప్రవాహగంభీరంబునునయినసంసారపారావారంబుదరించి మోక్షపారంబుఁగాంచి కృతకృత్యుండవై నుత్స్వరూపసమాధి నిష్ఠుండవై యానందింపుమని పలికిన నప్పవననందనుండు సీతాదేవిలక్ష్మీదేవి యనియును లక్ష్మణుండు శేషుండనియును భరతశత్రుఘ్నులు పాంచజన్యసుదర్శనంబు లనియును సింహాసనంబు సుపర్ణుండనియును శ్రీరామచంద్రుండాదినారా యణుండనియును నప్పుడుపదేశించిన పరబ్రహ్మతత్త్వజ్ఞానంబు సకలవేద శాస్త్రపురాణాగమేతిహాసస్మృతిసారంబనియును నెఱింగి పరమానందకం దళితహృదయారవిందుండయియా శ్రీసీతారామాచార్యులచరణారవిందంబు లకనేకవందనంబులు గావించినిటలంబడి కరకమలంబులు ముకుళించి నిర తిశయ వినయపూర్వకంబుగా నిట్లనియె॥ క॥ శ్రీరామరామరామర । మా రామామణినుమోరమారమణా శ్రీ। నారాయణనారాయణ। నారాయణ నిజసహస్రనామస్తుత్యా॥ .. .. ... ... ... ... *

శ్లో॥ దేహబుద్ధ్యాత్వస్మిదాసోహంజీవబుద్ధ్యాత్వదంశకః । ఆత్మ బుద్ధ్యాత్వమేవాహమితి మెనిశ్చితామతి॥ ... ... ...

వ॥ అనిపల్కి సాదరంబుగా ననుజ్ఞాతుండయి నిజాశ్రమంబున కరి
గియాహ్నికమ్మునంతటఁ దొక్క పరమైకాంతస్థలంబున సుఖాసీనుండయి శ్రీరా
మ చరణకమలభక్తియుక్తుండును శ్రీరామనామజప పరాయణుండును శ్రీరా
మబ్రహ్మతత్త్వావలోకన నిరతిశయనిర్వికల్ప సమాధినిష్ఠుండును నై జీవన్ము
క్తిసుఖంబనుభవింపుచు నిమ్మహాశ్రమంబున నున్నవాఁడనిపలికి శ్రీమహాదే
వుండప్పార్వతీదేవికిట్లనియె॥ గీ॥ మంత్రముంత్రాగ్ర్యమంత్రాభిమానదేవ|
తాస్వరూపంబులివినీకుఁ దాఁపకేను। నేఁడుఁగనుపదేశమిచ్చితినింతకంటెఁ ఘ
వనిధానంబులేదు। వామనమునందు॥ క॥ నిఖిలకలుషసంక్షయకర। మఖిలా
భీష్టప్రదంబనంతావ్యయమి। త్సుఖదముజగదధిసత్యధి। ముఖకరమగుమంత్ర
రాజముమహాదేవీ॥ సీ॥ బహుజన్మసంచితపాపంబులునశించు విమలధర్మము
లభివృద్ధినొందు! నాయురారోగ్యంబులధికంబులై యొప్పు బహుతరైశ్వర్య
సంప్రాప్తియగును। ధృతియునుగీర్తియు దేజంబుబలమును శాంతిదాంతిక్ష
మార్జవములబ్బు। ధనధాన్యపుత్రపౌత్రకళత్రబాంధవ పశుగజాశ్వాదిసం
పత్తులుఁగలుగుఁ। బుడమిలో నెన్నిసద్గుణంబులుగలవు। నన్నిగుణములుఁ
బ్రాపించు నాత్మతోడ। సతతమీరామహృదయంబు చదువుకొనుచు। దద్వి
చారంబుఁగావించు ధన్యులకును॥ క॥ శ్రీరామహృదయమును బ। ల్మారుగఁ జపి
ంచుబుధసమాజంబునకున్। శ్రీరామతత్త్వసాక్షా। త్కారంబగుఁగలు
ఁబరమకైవల్యంబున్॥ వ॥ అనిచెప్పి। క॥ ఆతతముగనెఱిఁగింతి। సీతా
రామాంజనేయసత్సంవాదం। బీతత్త్వామృతమానిసి। రాతంకసుఖాబ్ధినో
లాడుముగిరిజా॥ వ॥ అనిపలికియయ్యాదిదంపతులు రామబ్రహ్మానందా
మృతరస పానమదపరవశులై యన్యోన్యాలింగనంబులుగావించి పరమ
సుఖైకస్వరూపులై నిజచరణకమలసేవాసక్తులైన భక్తుల రక్షింపుచుఁ బ్ర
కాశింపుచుండిరంత॥ ... ... ... ... ... ... *

మత్తకోకిల.

నీవునాహృదయాంబుజంబున నిచ్చభానుని కైవడిం। గేవలాత్మవివే
కుఁడై వెలిగించుచుం బరికింపఁగాఁ। బావనంబగు రాజయోగము పల్కితిం
దె శ్రీమహా। దేవసద్గురురాయ కావుము దీననీ ఖలరంజిలన్॥ శా॥ దత్తా
త్రేయగురుస్వరూపనిజభక్తాంత స్తమోదీపన। చ్చిత్తానందకరానులాపఖమ

దచ్ఛిత్రాంశువార్ధ్యాపర్ణీ। వృత్తిత్యాగకలాపనిత్యసుఖసం విద్వ్యాపస్థాత్మశ। శ్వత్తేజోభిహతాదిపాపసుజనేష్టప్రాప్తకావ్యాపరా॥ క॥ ప్రణవాత్మకసదనశాం। రణసంపూర్ణప్రభాభిరామసగుణని। ర్గుణనిర్వికారనారాయణసీతారామగురుమహాదేవశివా॥ .. ... ... .. *

మాలిని॥ ఘనతరసువివేకాకల్పితాశేషలోకా। వినమితబుధలోలావిశ్వవిఖ్యాతలీలా। జనమతగణతంత్రా సర్వతంత్రస్వతంత్రా। మునిసరసిజమిత్రా మోక్షలక్ష్మీకళత్రా॥ ... ... ... ... *

గద్య॥ ఇది - శ్రీమన్నారాయణమహాదేవగురుకరుణాకటాక్షవీక్షణ విమలీకృత నిజహృదయకమల కర్ణికాంతస్సందర్శితాఖండసచ్చిదానందరససైకస్ఫూర్తి పత్ప్వుర శీతారామమూర్తి పరశురామపంతుల లింగమూర్తి గురుమూర్తి ప్రణీతంబయిన శ్రీసీతారామాంజనేయ సంవాదంబను యోగశాస్త్రంబునం దమనస్కయోగానుభవవిచారంబన్నది సర్వంబును దృతీయాశ్వాసము॥

—— * ——

శ్రీసీతారామాంజనేయసంవాదము.

సంపూర్ణము.